# గౌరి కోసం.



సోమయాజుల వేంకట రామమూర్తి.











వెల రు 0-6-0

# సిద్ధౌషధం

## (ఏకాంకనాటిక)



### దృశ్యము—౧

[స్థలము:—St. Aloysius Hospital నందు రోగులుండేహాల్ హాల్లో పదిమంచాలు. మంచాలకు వరుసగా పదినంబర్లు. ఏడవనంబరు మంచముపై ఒకరోగి అతి బలహీనావస్థలో కన్నులుమూసుకొని పరుండిఉంటాడు. ప్రక్కన డాక్టరు వంగి అతని నాడిని పరీక్షిస్తూంటాడు. మంచముప్రక్కగా ఒకనర్సు-Sister Bertha చేతులుకట్టుకొని నిలబడిఉంటుంది.

సమయము:—రాత్రి పదిగంటలు.]

డాక్టరు:—(పెదవివిరచి, మెల్లగా నిట్టూర్పుపుచ్చి) పడవ మునిగిపోతూంది. తెల్లవారేలోపున ఈఅధ్యాయం ముగిసి పోతుందని నానమ్మకం.

సిస్టర్ బెర్తా:—ఏడుగంటలకు మీరిచ్చిన injection పని చెయ్యనేలేదా?

డా:—రోగమొకతెన్నూ, మందొకతెన్నూ!

సి. బె:—ఇంతప్రయత్నం వృథాయేనా?

డా:—చీకట్లో తడుముకున్నట్టు, రోగంఏమిటో తెలియకుండా అటూ ఇటూ ఊహించుకుంటూ చేసినచికిత్స వృథా కాక మరే మౌతుంది?

సి. బె:—రాష్ట్రానికంతకూ ప్రఖ్యాతవైద్యులని పేరుగాంచిన మీరుకూడా ఈరోగాన్ని నిర్ణయించడానికి శక్తి చాలింది కాదంటే నమ్మడానికి వీల్లేకుండాఉంది.

డా:—సిస్టర్ బెర్తా, నువ్వు నాపైనున్న గౌరవంచేత అలా గంటున్నావు. ఈ No. 7 విషయంలో నేను పూర్తిగా ఓడిపోయానని ఒప్పుకోకతప్పదు.

సి. బె:—ఇతణ్ణి రక్షించేఉపాయం లేనేలేదా? ఈపాతికేళ్ళ బలమైనజీవనం, భగ్గున మండిపోవలసిందేనా?

డా:—సిస్టరుబెర్తా, నీబేలతనం నాకు ఆశ్చర్యం కలిగిస్తూంది. ఇలాంటిదృశ్యాలు మనకు పరిపాటేకదా? పాతికేళ్ళవాడైతే నేమి, పిలుపువచ్చాక? కాలగతి! ఎవ్వడు తప్పించగలడు?

సి. బె:—ఇతనిప్రాణం నిలబెట్టేఉపాయం లేనేలేదా?

డా:—స్థితినిబట్టి లేదనేచెప్పాలి. Nothing but a miracle can save him. నీకేమైనాఉపాయం suggest అయితేచెప్పు, చూద్దాం.

సి. బె:—నేనా? నాకేమితెలుస్తుంది, మీరే—

డా:—మనడ్యూటీ మనం తుదివరకు చేసితీరాలి, రోగికి ఊపిరున్నంతవరకూ - రోగి కాయాసంలేకుండా చెయ్యడం మనవిధికాదా?- నువ్వు, అరగంటకొకసారి half a teaspoon ఔషధం వేస్తూండు; గుటకవేసినంతవరకూ మంచినీళ్ళు కావలసినన్ని యిస్తూండు.

సి. బె:—Yes, doctor.

డా:—Goodnight! (నిష్క్రమిస్తాడు)

సి. బె:—Goodnight-indeed! (స్వ) గుడ్‌నైట్! ఎంత అర్థంలేనిమాట! నేడెవరికి గుడ్‌నైట్?- కాళ్ళూ చేతులూ

ఆడక రోగం ఇదమిద్ధమని పోల్చుకోలేకుండా వెర్రిమొగం వేసిన డాక్టరుగారికా, లేక - యౌవ్వనంలో ప్రపంచాన్నం తనూ ఉద్ధరిస్తానని గంపెడాసలోఉండి, ప్రాణావశిష్టుడై పడి ఉన్న ఈ No. 7 రోగికా - లేక, ఇతణ్ణి కనిపెట్టుకునిఉండి, మృత్యువు క్రమంగా మానవుని ఏలాగుదిగమ్రింగేస్తుందో కన్నులారా చూడ్డానికి నోచుకున్న నాకా ?- గుడ్ నైట్ !- గుడ్ నైట్ !- ఎంతమాత్రమూ కాదు. ఇది Badnight !- Worst possible night, నిశ్చయంగా ! (రిస్టువాచి చూచుకొని రోగికి మందుపోయును. రోగి మందుమ్రింగి పెదవులు చప్పరించును. అదిచూచి నర్సు అతనికి నీరిచ్చును. రోగి ఒకఔన్సు మంచినీరు త్రాగును. నర్సు నాడిపరీక్షిస్తూంటే)

[తెర]

[పూర్వపు రంగమే -

సమయము:- 12 గంటలు]

(సిస్టర్ బెర్తా రోగివైపు నిదానించి చూస్తూంటుంది. నాడి చూచి, కొంచెంధైర్యంగా తలపంకిస్తుంది.)

సి. బె:—(తనలో) Pulse బాగా return అయినట్టు కనిపిస్తూంది. ఇది తెల్లవారేవరకూ maintain అయితే hope ఉండవచ్చును ! (తిరిగి రోగిముఖం చూస్తూంది. రోగి రెప్పలల్లారుస్తాడు) చాలా ఆశ్చర్యంగాఉంది ! ఇతడుమెల్లిగా రెప్పలల్లారుస్తూన్నట్టుందే !- ఔను, నిజమేను !- కన్నులు మెల్లిగా విప్పుతున్నాడు !- బహుశః ఇది చావుతెలివి కావచ్చును - ఆరిపోయేముందు దీపకళిక ఒక్కసారిదుమికి శాశ్వతంగా అంతరించిపోయినట్టు, ప్రవాహంలో ఈదులాడుతూ అలసిపోయిన

మానవుడు ఒక్కసారిమునిగి, తిరిగీలేచి, రెండవసారి మునిగి, అడుగంటిపోయేటట్టు ఈ ప్రాణికూడ జీవన్మరణ సందిగ్ధావస్థలో కొట్టుకుంటున్నాది- అంతేకాని- ఇతను జీవించేదేమిటి!- హాభగ్రిపు !-

No. 7:— (కొంచెం ముఖం ప్రక్కకుతిప్పి nurse వైపు చూస్తాడు. మెల్లిగా మాట్లాడేఉద్దేశంతో పెదవులు కదలిస్తాడు. Nurse అతణ్ణి సమీపిస్తుంది)-సి-స్ట-ర్—బె ర్తా-!

సి. బె:—(అతనిభుజముపై చేయివేసి)-ఔను, నేనే.

No. 7:—కొం-చె-ము—నీ-రు-

(నర్సు నీరుతెచ్చియిచ్చును. రోగి రెండుచెమ్చాలు త్రాగును)

No. 7:—నేను - చనిపోవుటకు ముందు - ఒకవిషయము - చెప్పవలసి - యున్నది !- అయ్యో !-

సి. బె:—మీరు ఆయాసపడకండి (మంచం అంచున కూర్చుండును)

No. 7:—నేను - మృత్యుముఖానికి ప్రయాణం సాగిస్తున్నాను - ఆసంగతి - నీకుకూడా తెలుసును - నిజమేనా ? దాచకుండా చెప్పుమని ప్రార్థన -

సి. బె:—ఒకగంట క్రిందటివరకూ నేను అలాగే అనుకున్నాను - నేనేకాదు. డాక్టరుకూడా ఆలాగేఅనుకున్నారు - కాని ఇప్పుడు మీస్థితిలో, ఒకమార్పు -

No. 7:—వట్టిభ్రమ !- ఇది చావుతెలివి ! నీకూతెలుసును నాసంగతి !- ఇదీఒక మరణతరంగమే. ఒకప్పుడు ముంచుతుంది - మరుక్షణాన్ని తేలుస్తుంది - నన్నీతరంగం తిరిగీ ముంచకపూర్వం నీకొకవిషయము చెప్పవలెననిఉంది ! సావకాశంగా కూర్చో.

సి. బె:—మీరు అనవసరంగా ఆయాసపడక చెప్పవలసినదేదో ముక్తసరిగా తెమల్చండి.

No. 7:—సిస్టర్ బెర్తా !- మరేమీ లేదు - నేను నాపాతికేళ్ళ జీవాన్ని మరణాగ్నిలో పడవేయడానికి సంకోచిస్తున్నాననుకుంటున్నావేమో !- నాకట్టి అనుమానం, అట్టిభయం లేదుసుమా !- నేను నిర్భయంగా మరణానికి ఎదురుచూస్తున్నాను - నాకు మృత్యువే ప్రాణస్నేహితుడు !

సి. బె:—ఏమలాగంటున్నారు ?

No. 7:—జీవితంలో శాంతిలేకపోయిన నాబోటివానిని, మృత్యువు శాంతిధామాన్ని చేరుస్తుందిగనుక !

సి. బె:—ప్రస్తుతం శాంతిలేకపోయినా, జీవితంలో ఆశఅనేది ఉండకుండా ఉంటుందా ?- భావికాలాన్నికైనా -

No. 7:—ఆశ !...ఉండొచ్చును కొందరికి !- నాకు ఆశ కూడా లేదు !

సి. బె:—ధైర్యంవహించండి - మీరనవసరంగా ఆయాసపడకండి -

No. 7:—మరణము నాబంధువు - ఏలనంటావా ?- ఇంతవరకూ నేను ఏకాకిని - నిరాధారజీవిని - ఇప్పుడు నాకొక సఖుడున్నాడు - అది 'మృత్యువు !- నేను జీవిస్తానని నాకు నమ్మకంలేదు !- జీవించవలెనని ఆశయులేదు !

సి. బె:—మీ జీవితకథ సెలవివ్వండి !-

No. 7:—ఔను - నీకు విసుగులేకపోతే చెబుతాను.

సి. బె:—లేదు మీకథ తెలిసికోవాలని ఉత్సాహంగాఉంది.

No. 7:—కృతార్థుడను - నేను నిరుపేదను - పేరు విద్యాధరరావు !

సి. బె:—చక్కని పేరు !-

No. 7:—చాలా చక్కని పేరు !- చిన్నప్పుడు పాఠం వప్ప చెప్పకపోతే, మేష్టరు, నవ్వుతాలుగా "నీకెవడిచ్చాడురా, యీపేరు ? విద్యాధరరావుట !" అని ఈసడించడానికి బాగా పనికివచ్చింది !- నాదేమి జాతకమోగాని, బాల్యంనుంచి నేటి వరకూ - నాజీవితం ఒక్కలాగే తెల్లవారింది !-

సి. బె:—పోనీచెప్పండి మీకథ !

No. 7:—నేను ఏకాకిని - నేనొక కవిననుకున్నాను - నా కవిత్వం నాకెంతో రుచించేది - కాని ప్రపంచానికి చేదయి పోయింది - అందుచేత నాపేదరికానికి, నాకవిత్వమే కారణమైనది !

సి. బె:—మీకవిత్వం ప్రపంచానికి నచ్చకపోవడానికికారణం?

No. 7:—ప్రపంచం స్వార్థంతో నిండిఉంది. ప్రపంచంలో చాలభాగం స్వప్రయోజనపరులు - నేను నా వ్రాతల్లో స్వార్థ త్యాగం చెయ్యమనిబోధించడం ఆరంభించాను ! అదాలగుండనీ - మాపొరుగింటి అమ్మాయి, విమల, నన్ను ప్రేమించింది. నన్ను పెళ్ళాడడానికి పోరుపెట్టింది. అప్పట్లోనాకు కవిత్వంగోలే కాని - ప్రేమననుభవించే చింతేలేకపోయింది. నేను చలించకపోవడం చూచి, విమల - నేనొక పాషాణాన్నంటూ నన్ను దూషించేది. ఆమెమాటలు నాకేమీ అర్థం కాలేదు. ఇంతలో విమలకి పెళ్ళయింది. విమల అత్తింటికి వెళ్ళిపోయింది. ఇప్పుడు అంత్యకాలానికి - నాకాముఖం కనుపించింది.

సి. బె:—కలలోనా ?

No. 7:—కాదు. నిజంగానే - నీముఖం సరిగ్గా విమలముఖం లాగే ఉంది. చాలా ఆశ్చర్యకరమైన విషయం !- ఆకన్నులే!- ఆ పలువరసే - ఆ మందహాసమే !- నీవు - ఇప్పుడు నాప్రక్కను కూర్చొని, నాజీవనజ్యోతి ఆరిపోయేసమయానికి - ప్రాపంచకసౌఖ్యం అంటేఏమిటో ఎరుగని నాఅంధకారమయ జీవితానికి, దయాజ్యోత్స్నవైనావు ! (కన్నీరు - నిశ్శబ్దం)

సి. బె:—(చేష్టదక్కి ఎక్కడో చూస్తూంటుంది)

No. 7:—నువ్వు, నాశూన్యజీవితానికి సూడిదవైనావు - మరణించేముందు నీముఖంచూచి ఎంతోఆనందాన్ని పొందుతున్నాను !

సి. బె:—ధైర్యంవహించండి ! సర్వేశ్వరుడే మనకందరికీ తోడునీడ.

No. 7:—సిస్టర్ బెర్తా !- నువ్వునాకొక ఉపకృతిచేయగలవు!- చేస్తావా ?

సి. బె:—తప్పకచేస్తాను ! (ఆతృతగా) ఏదది ?

No. 7:—చెప్పేపూర్వం ఒకప్రశ్నకి జవాబుచెప్పు - నేను శాంతంగా ప్రాణంవిడిచిపెట్టడమే నీయుద్దేశముకాదా ?

సి. బె:—ఔను - మీరు ప్రాణమువిడచుటే తప్పనప్పుడు !

No. 7:—నీవునాయొక్క ప్రశాంతమరణానికి తోడ్పడగలవు

సి. బె:—ఎలాగు ?

No. 7:—ఒక్క ... ... ...

సి. బె:—చెప్పండి !-

No. 7:—ముద్దు ... ... నోసంగి ! ...

సి. బె:—(తుళ్ళిపడి, శాంతించి) ముద్దా ! ... ... మృత్యుసముఖాన్ని ముద్దా !...

No. 7:—ఔను - ముద్దు ! అమాయకమైన ప్రేమకు పరిణామమైనట్టి ముద్దు ! అట్టిముద్దుగొని నేను ముక్తిపొందుతాను మరణిస్తాను. అప్పుడది మరణంఅనిపించుకోదు. అప్పుడునాకు అమరత్వం సిద్ధిస్తుంది - నీవొక అమర్త్యకన్యవు. ఒకరిసౌఖ్యం కొరకు నీసౌఖ్యాన్ని ధారపోయడమే వృత్తిగాగొన్న కరుణాశీలవు !- నీ చిత్తవృత్తులు, నీ కోమలస్వభావం, నీదయారస పూరిత హృదయం !- నీవొక స్వర్గీయవ్యక్తివి ! అట్టినీ స్పర్శ వలన నాకమరత్వం సిద్ధించకేమౌతుంది ?- మృతిలో అమరత్వము ! What a paradox !

సి. బె:—మీరుకవులు. కాబట్టి ఏమైనావర్ణించగలరు. నన్ను గురించి మీరిప్పుడుచెప్పిన వాక్యాలు నన్నుపూర్తిగా సిగ్గుపరిచినవి. (తలవంచుకొనును)

No. 7:—నాఅర్జీవిన్నపము మాట ?
సి. బె:—ముద్దుగురించేనా ?

No. 7:—ఔను. నీలో జీవనది ఉద్రేకముగా ప్రవహిస్తూ న్నది. నేనో - మరణోన్ముఖుడను! నాహృదయంలోని రుధిర ప్రవాహము చల్లబడిమందగించిపోవుచున్నది. కొలదివేపులో అది నిలిచిపోతుంది. నాకన్నులు మూసుకొనిపోతాయి! నీ ముఖకమలం నాదృష్టిపథంలోనుంచి తొలగిపోతుంది !- అది సంభవింపక మునుపే - ఒక్కముద్దు - కేవల మొక్కముద్దు మన ఇరువురికిని సంబంధం కూరుస్తుంది - దానిలో మనమిరువుర మేకమై - జీవన్మరణములతో కూడుకున్న మానవజన్మ మున కొక పవిత్రచిహ్నమైపోదాము ! అవసానకాలమున చెల్లించవూ ?

సి. బె:— (కొంచెంసేపూరుకుండి) మీరు దివ్యపురుషులు. మిమ్మ్మ సర్వేశ్వరుడు ముద్దుపెట్టుకుంటాడు !

No. 7:—నాయాత్మకు శాశ్వతశాంతి నీయవా ?

సి. బె:—(కన్నులు మూసుకొని, ఒక్క అశ్రుబిందువురాల్చి అతనిని సమీపించి) సోదరా !- సోదరా !- (అని పిమ్మట అతనిముఖముపై తనముఖముంచును. ఆమెకన్నీరు అతని చెక్కిలిపై పడును. కొంచెముసేవు వారట్లేయుందురు. No. 7 దృష్టిలో సజీవమైన ఆనందము కాన్పించును)

[తెర]

---

దృశ్యము—౨

[పూర్వపు రంగమే -

సమయము ఉదయం 7 గంటలు]

(డాక్టరుగారు, సిష్టర్ బెర్తా మాట్లాడుతుంటారు)

డా:—చాలా ఆశ్చర్యకరమైన విషయము !

సి. బె:—ఏది ?

డా:—No. 7 ఇంకా జీవించియుండడమనేది !

సి. బె:—జీవించడమే కాదు. రాత్రి ఒంటిగంటనుంచీ రోగం మళ్ళింది. ఇపుడు No. 7 సుఖనిద్రలోవున్నాడు. పరీక్షించండి. (వారిరువురు No. 7 మంచం సమీపిస్తారు. డాక్టరు అతనినాడి పరీక్షిస్తాడు)

డా:—(ఆశ్చర్యంగా) Wonderful !- నా injection, నీ పరిచర్య బాగాపనిచేశాయి ! చెయ్యిచూడు. ఇపుడు నీ pulse కీ ఇతని pulse కీ ఏమీభేదంలేదు - రెండూ ఒక్కలాగు కొట్టుకుంటున్నాయి !

సి. బె:—నేను చెప్పలేదూ, మీకు అసాధ్యమైనరోగం ఉండదని ?

డా:—ఏదో గుడ్డిగుర్రపుతాపు !- తగిలిందిదెబ్బ ! మళ్ళింది రోగం !- నిజంగా ఈ No. 7 ది ఒక miraculous recovery ఇంతలో ఈఅబ్బాయిఘటం ఇలాగు నిలబడుతుందని 'నేనను కోలేదు నిజంగా ! (తరువాత 8నెం. మంచందగ్గరకు నిష్క్రమిస్తాడు)

సి. బె:—(No. 7 చెయ్యిచూచి) ఘటం నిలబడింది. మరి పర్వాలేదు. ఎగిరిపోదామనుకొని రెక్కలువిప్పిన పక్షి, తిరిగి ముడుచుకొని, పంజరంలోనే నిద్రపోయింది !-

కాని నాహృదయంలో ఆందోళన ఎక్కువగాఉంది - నేనెట్టి కృత్యం చేశాను !- ఇది పాపమా, పుణ్యమా ! నిర్ణయించ లేకుండా ఉన్నాను. అంత్యదశలో - అతను ముద్దుకావా లన్నాడు !. నేను ఒడంబడ్డాను - అతని ఆత్మశాంతికి! ఇంను లాలసలేదు ! లేనేలేదు - నాఅంతర్వాణి, ఇందేమీ తప్పు లేదంటున్నాది ! ఆమరుక్షణం ఇదొక పాపకార్యమనుకుని నేను భయభీత నౌతున్నాను !- ఈ ధర్మసందేహాన్ని father Rosha నడిగి తీర్చుకోవాలి,- అంతేచేస్తాను !

[తెర]

---

దృశ్యము—3

[స్థలము:- Father Rosha యొక్క డ్రాయింగ్ రూమ్.
సమయము:- సాయంకాలము 6 గంటలు.]

(ఫాదర్ రోషా పచారుచేస్తుంటాడు. సిస్టర్ బెర్తా కుర్చీలో కూర్చొనిఉంటుంది)

ఫా. రోషా:—నీ అంతర్వాణి, ఆకార్యం మంచిదని చెబుతుందా ?

సి. బె:—ఔనండీ !

ఫా. రో:—కాని అది అవినీతియని మళ్లీఅప్పుడప్పుడు భయం వేస్తుందా ?

సి. బె:—ఔను.

ఫా. రో:—సరే - నీవయస్సు ?

సి. బె: —19 సంవత్సరాలు.

ఫా. రో:—(నవ్వి) 19 సంవత్సరాల వయస్సులో - స్త్రీల విషయంలో అంతర్వాణిని, ఆత్మను నమ్మడానికి వీల్లేదు.

సి. బె: —ఎందుచేతనో ప్రశ్నించవచ్చునా ?

ఫా. రో:—ఎందుచేతనా ?- స్త్రీలకు 20 సంవత్సరాలలోపు ఆత్మేవుండదు. అల్లాంటప్పుడు అంతరాత్మ ఎక్కడ్నుంచివస్తుంది. అంతర్వాణి ఎక్కడ్నుంచి వినిపిస్తుంది ?

సి. బె:—ఆత్మే ఉండదంటారా ? మీ మాట నాకర్థంకావడం లేదు !

ఫా. రో:—ఎలాగర్థమౌతుంది ? నా ఉద్దేశం ఏమిటంటే - 19 ఏండ్లవయస్సులో ఇంద్రియముల రాపిడికి భరించలేక ఆత్మ ఏదోఒకమూలకి చేరి నిద్రపోతుంది. ఆత్మే నిద్రపోతూంటే అంతరాత్మ ఎక్కడుంటుంది ? నీది చిన్నతనం ! నేను కాలాలు గడిపినవాడిని ! అదిమంచో చెడ్డో నేనునిర్ణయిస్తాను. చెప్పమ్మాయీ, నీకథను పొంతంగా !

సి. బె:—మొన్నరాత్రి - మా ఆసుపత్రి, 5వ వార్డులో 7వ నంబరురోగిని డాక్టరు పరీక్షించి, పెదవి విరచేశాడు. దాని అర్థం తెలిసి ఆరోగిని కనిపెట్టుకొనే ఉన్నాను.

ఫా. రో:—7వ నంబరు రోగిఅంటే - ఆడదా - మొగాడా?
సి. బె:—మీకు చెప్పలేదూ ?
ఫా. రో:—7వ నెంబరంటే ఏ gender ఓ - ఎలాగు తెలుస్తుంది? నంబరుకు gender ఉండదుకదూ ?
సి. బె:—7వ నెంబరు రోగి పురుషుడేనండి !
ఫా. రో:—(నెమ్మదిగా) ఊఁహూఁ! పురుషుడే? వయస్సు?
సి. బె:—పాతికేళ్ళు.
ఫా. రో:—పాతికేళ్లు! నీకు 19, అతడకి పాతిక! సరే, అతడికి జబ్బేమిటి ?

సి. బె:—అదేమిటో డాక్టరు పోల్చలేకపోయాడు.
ఫా. రో:—పోల్చలేనిజబ్బు!- సరే - బాగానేఉంది! (చిరునవ్వు) కానీతల్లీ నీకథ !
సి. బె:—అంత్యకాలానికి, అర్ధరాత్రిని, అతనికికొంచెం తెలివివచ్చి, విషాదకరమైన తన ఏకాకి జీవితకథను నాకుచెప్పి తన ఆత్మశాంతికై నన్ను స్నేహభావంతో ముద్దెట్టుకుంటానన్నాడు.

ఫా. రో:—ఆఁ ... ... ఆఁ ... !
సి. బె:—లేకపోతే, అదితన సంతతదుఃఖానికి కారణమాతుందన్నాడు. నిష్కారణంగా అతని ఆత్మయొక్క పరితాపానికి నేను కారణంఅవడం నాకిష్టంలేక - అతనిమనోరథం తీర్చకపోతే, అదినాకు పాపమని ఊహించి...
ఫా. రో:—ఏమిటీ?- మృత్యువు ముద్దరకొట్టిన అతని ముఖాన్ని నీవు ముద్దెట్టుకున్నావూ ?
సి. బె:—ఔను. చంటిపిల్లవాడిలాగు పండుకొనిఉన్న అతనిపైనేను మెల్లిగావంగి, అతనిముఖము నాముఖముపై వుం

చాను. నాపెదవులు అతని పెదవులు కలుసుకున్నాయి. అప్పు డతని నయనాల్లో నాకొక స్వర్గీయజ్యోతి కానవచ్చింది. శుష్కించిన పెదవులపై మందహాసం చిగురించింది.

ఫా. రో:—పెదవులే! పెదవులే ముద్దెట్టుకున్నావూ? నుదుట నైనాకాదు!- అయ్యో! ఎంతప్రమాదం!- ఎంత ఘోరం!- అధరాన్ని ముద్దెట్టుకోడమే!-

సి. బె:—(భయముతో) - అయితే ఇది పాపకృత్యమనే నిర్ణ యించారు?-

ఫా. రో:—(కొంచెము సేపూరకుండి) - అయితే ఆ 7వ నం బరు పురుషరోగి ఎన్నిగంటలకు మరణించాడు?

సి. బె:—మరణించలేదు. జీవించియే యున్నాడు!

ఫా. రో:—(గుడ్లు మిటకరించి) - హాం! మరణించలేదూ?- జీవించియున్నాడూ?- హాం ...!- ఎలాగు జీవించాడు? డాక్టరు చచ్చిపోతాడని చెప్పలే?-

సి. బె:—ఔను. డాక్టరు అలాగనుకున్నాడు - అంతే - కాని అతనిరోగం మళ్ళిపోయి అతను ఆరోగ్యమార్గాన్ని పట్టేడు.

ఫా. రో:—ఇది సాధ్యమా?- డాక్టరు చెప్పేక?

సి. బె:—ఎందుకు కాకూడదు?- కాని నాకూ ఆశ్చర్యం గానేఉంది, అతని సుముఖత!

ఫా. రో:—ఏమిసుముఖతో చంపేశాడు! అతడు బ్రతకడం కాదు కాని!-

సి. బె:—బ్రతకడమే కాదు - గంటగంటకూ పూర్ణారోగ్య వంతు డౌతున్నాడు.

ఫా. రో:—కొంప పోయింది.

సి. బె:—ఏమలాగంటున్నారు?

షా. రో:—అదికాదు చనిపోతున్నవాడిని చావనివ్వకుండా ముద్దెట్టుకున్నావు !- ఎంత దుష్టపని !

సి. బె:— ఇది దుష్టపనా ?

షా. రో:—దుష్టపనికాదూ ? భగవంతుడు చంపేవలచుకొని శరీరంలోని ఉష్ణాన్ని, జీవనదీ ప్రవాహాన్ని, శక్తిని, తేజాన్ని జ్ఞానాన్ని, చైతన్యాన్ని, అన్నింటినీ - మండుతూన్న పొయ్యలోని కర్రలు ఒక్కొక్కటే దిగలాగేసినట్టు - మందగింపజేసి, 'మరణం' అనే సీలు గట్టిగావేసి 'మృత్యువు' అనేస్టాంపును గట్టిగా అంటించి, పరలోకానికి టపాకట్టిన ఒకానొకవ్యక్తిని, ఒకానొక మృత్యుమార్గానువర్తిని, No. 7 అనే ఈరోదన సంఖ్యను - నీవు ముద్దెట్టుకొని జీవాలుపోసి పునర్జీవితుణ్ణి చేశావు ! ఇది - ఈనీకృత్యము భగవంతుని ఆజ్ఞకు విరోధం కాదూ ?- ఎంతపాపము ! ఇంకా 'పాపమా' అని మెల్లిగా అడుగుతున్నావా ? పాపమా, మరీపాపమా ?- ఘోరమైన పాపం !

సి. బె:—అయ్యో, నేనుపాపినా?- నేను దుర్మార్గురాలనా?- నాకేదిగతి ?

షా. రో:—అదే ఆలోచిస్తున్నాను.

సి. బె:—ఈపాపానికి ప్రాయశ్చిత్తంలేదా ?

షా. రో:—అదే యోచిస్తున్నాను. (కొంచెముసేపూరకుండి) 7వ నంబరుస్థితి ప్రస్తుతం ఎలాగుంది ?

సి. బె:—చాలా బాగాఉంది - హార్టు, లంగ్సు, లివర్, కిడ్నీస్, అన్నీ బాగాఉన్నై. అతడిప్పుడు ఆరోగ్యమార్గాన్ని అతిచురుగ్గా ప్రయాణం సాగిస్తున్నాడు.

షా. రో:—డాక్టరుగారేమన్నారు ?

సి. బె:—No. 7 :ఆరోగ్యవంతుడవడం - డాక్టరుగారికీ ఆశ్చర్యంగానే ఉంది. ఈరీతినైతే అతనొక కొలదిదినాల్లో సంపూర్ణమైన ఆరోగ్యంకలిగి ఎప్పటివలె నుంటాడని చెప్పేడు.

షా. రో:—ఆరోగ్యవంతుడు కాడూమరి? నీముద్దే ఇంత ముప్పు తెచ్చింది.

సి. బె:—ముప్పేం ముప్పు?

షా. రో:—దైవాజ్ఞను నిరోధించడంవల్ల ముప్పుకాదూ?

సి. బె:—ఎలాగు?

షా. రో:—మరణిస్తూన్నవాణ్ణి అమాంతంగా బ్రతికించి, అతని ఉత్తరగతులు అరికట్టినదానివైనావు! దైవాజ్ఞ నుల్లంఘించిన పాపాన్ని చేశావు!

సి. బె:—మీశాస్త్రాల్లో ఎట్టిపాపానికైనా ప్రాయశ్చిత్తం ఉంటుందిగా? అదేదో సెలవివ్వరాదూ!

షా. రో:—అదే ఆలోచిస్తున్నాను - No. 7 ఎన్నాళ్ళలో నడవడానికి శక్తిపొందుతాడు?

సి. బె:—మరియొక పక్షంరోజుల్లో -

షా. రో:—అయితే అప్పుడు, నువ్వూ, నీ నెం 7, యిద్దరూ కలసి నావద్దకురండి.

సి. బె:—సరేకాని నాకుప్రాయశ్చిత్తం? నాకీ పాపపంకిలం ఎలావదుల్తుంది?

షా. రో:—అందుకే మీఇద్దర్నీ రమ్మంటున్నాను. నేనుచెప్పే ప్రాయశ్చిత్తం మీఇరువురితోనూ సంబంధించిఉంది!

సి. బె:—ఆఁ?

షా. రో:—ఔను. ఈపాపం మీఇద్దరిదీని! ఇద్దరూ పంచు

కున్నారుకాబట్టి ప్రతిక్రియకూడా మీయిరువురికీ జంటగా కావలసి ఉంటుంది !

సి. బె:—(తెల్లబోయిచూచును)

ఫా. రో:—ఏమిటలాగు చూస్తున్నావు ?

సి. బె;—మీ మాటలు నాకర్థంకావడంలేదు.

ఫా. రో:—మీరిరువురూ వివాహంచేసుకోండి. నేనే, మీ వివాహానికి ఆచార్యుడనౌతాను.

సి. బె:—(ఆశ్చర్యపడి) ఏమిటీ ?

ఫా. రో:—దానితో అన్నిపాపాలు పోతాయి. ఇదే ప్రాయశ్చిత్తం. ఏమి ? ఒడంబడుతావా ?

సి. బె:—(ఆశ్చర్యముతో కొంతసేపట్లేఉండి చిరునవ్వుతో) గురువులయాజ్ఞకు తిరుగుంటుందా ?

[తెర]

17

# గూని గుంపన్న



అసలా అబ్బాయిపేరు దుర్భా గుంపస్వామి. కాని 'గూనిగుంపన్న' అనే పౌరుషనామం, అతడికి గూనివుండడం మూలాన్ని వచ్చేసింది.

"వెధవా, గూనివెధవా, చాకలిమూటలాగు గూనీ నువ్వూను, నీఅల్లరి భరించలేకుండా వున్నాం, క్లాసులో; నిన్ను పచ్చడికిక్రింద దంచేద్దా మన్నంతకోపం నాకువున్నది కాని, నీగూనిచూచి కనికరం కలిగి, నిన్ను కొట్టడానికి కూడా చేతులురాకుండావున్నాయి." అన్నారు ఆమేష్టరుగారు.

గుంపన్న చాలాపెంకికుర్రాడు. ఆవేళ మేష్టరుగారు క్లాసులో ఎటండెన్సు వెయ్యడానికని ఒకర్ని ఫౌంటెన్ పెన్ ఇమ్మన్నారు. ముందుబెంచీలోకూర్చున్న గుంపన్న టప్‌మని తనజేబులోంచి కలంతీసి, తొందరగా మూతతీస్తూ, పరుగునా మేష్టారు కుర్చీదగ్గరకి వచ్చి, కలం మేష్టారికందిచ్చాడు. కాని ఆఅందించటంలో, మరి గుంపన్న చెయ్యాలనేచేశాడో, లేక అది ప్రమాదమో, చెప్పలేముకాని, ఆఫౌంటెన్ పెన్‌లోనుంచి నల్లని సిరాధార, జోతుకానావలె, మేష్టారి నుదుట్నికురిసి, గెడ్డంమీదుగా, ప్రవహించి తెల్లనిఉత్తరీయంమీదా కోటు మీద యింకిపోయి, తాత్కాలిక కలంకాన్ని ఆపాదించినది. అదిచూచి క్లాసులోకుర్రాళ్ళంతా గొల్లుననవ్వారు. మేష్టారు

తహతహలాడిపోయి, చిందులుతొక్కడం ఆరంభించారు. అప్పుడైనా ఊరుకున్నాడూ, గుంపన్న? "అయ్యో, మేష్టారూ! అయ్యో, మేష్టారూ!" అంటూ ముఖంమీద ఒక నిలువు చారగావున్న సిరా తనచేత్తో ముఖంఅంతటా అలికేసి, ఆ చేతిని మేష్టారిపాగాకి తగిలించాడు.

మేష్టారు:—వెధవా, గుంపిగా! నువ్వు వెంటనే బెంచీయెక్కు.

గుంపన్న:—నేనేం తప్పుచేశానండీ? మీరడుగుతే నాపెన్ ఇచ్చానండి. ప్రమాదంవల్ల సిరా మీమీదపడిందండి. పెన్ఇవ్వడమే తప్పాండీ?

మే:—ముందు బెంచీఎక్కు!- ఊ!. ఎక్కుతావా లేదా?

గుం:—ఎక్కలేనండి. (అని కిందనిలబడుతాడు)

మే:—గాడిదీ, అల్లరిచెయ్యగలవుగాని బెంచీఎక్క లేవూ? ఓయ్, మోనిటరూ, వీడు బెంచీయెక్కినాసరే, లేక పైకెళ్ళిపోయినా సరే - అదేదోచూడు. (రొసరొసలాడు తాడు.)

మోనిటరు గుంపన్న సీటుదగ్గరకి వెళ్ళి, చిరునవ్వు నవ్వుతూ "మేష్టారు ఎక్కమంటున్నారోయ్ - వేగంఎక్కు" అన్నాడు. అప్పుడు గుంపన్న, బెంచీఎక్కడానికి ప్రయత్నించి పొట్టచేత ఎక్కలేకపోతాడు. క్లాసంతా గొల్లుననవ్వుతారు.

గుం:—ఎక్కడానికి నాకేం అభ్యంతరంలేదు. కాని, ఎవ్వరైనా ఎక్కించాలిమరి.

మే:—(నవ్వి) అదా నీసూక్ష?

ఇంతలో మోనిటరు రెక్కపట్టుకుని ఎత్తగా గుంపన్న అతికష్టంమీద బెంచీమెక్కుతాడు. అదిచూచి మేష్టారు, "అయితే కిందనుంచో, ఈ'ఫీకిడ'ంతా నీ గూని నిన్ను కాపాడు తోంది, నిజంగా" అన్నారు. గుంపన్న కిందికిగంతువేసి, లోలోపల నవ్వుకుని, "నాకు గూనిప్రసాదించినందుకు దేము డికి పదినమస్కారాలు" అన్నాడు.

గుంపన్న పెంకివాడైనా మంచి తెలివితేటలుగల కుర్రవాడు. అందుకే మేష్టర్లందరికీ వాడంటే అభిమానం. గుంపన్న స్కూలుఫైనలు పేసయినాడు.

*　　*　　*

రామయ్యరెడ్డి ఆవూళ్ళోఒక సంపన్నగృహస్థు. అత నిది ఇనుపసామానువర్తకం. అతడికి ఒక తెలివైన గుమాస్తా కావలసివచ్చింది. రెడ్డి ఆవుద్యోగానికి తప్పకుండా గుంపన్ననే నియమిస్తాడని వూరంతా అనుకున్నారు. కాని దైవసంకల్పం వేరయింది. ఇంతకూ రెడ్డిగారి గృహిణి (ఆవిడ రెండోపెళ్ళి పెళ్ళాం రెడ్డిగారికి) ఆవిడగారి అనుగ్రహం గుంపన్నపై లేక పోయింది. ఆవిడమంచి ఎర్రగా బుర్రగావున్న ఇరవైయేళ్ళ వయసుగల ఒకకుర్రాడినిగూర్చి భర్తతో అవుద్యోగానికి గట్టిగా సిఫారసుచేసింది. లోపాయికారీమాట ఆవిడకీ, ఆ కుర్రాడికీ స్నేహం. అతడికే వుద్యోగం యివ్వాలని భీష్మిం చింది. "గూనివాడు నాగుమ్మంలో అడుగుపెడితే నేనువప్ప నంది. అంతేకాక "గూనివాడి మొగంచూడనని నావ్రతం" అన్నది. పాపం రెడ్డిమాత్రం, "నీవ్రతాలు నట్టింట్లోనూ, గుమాస్తా సావడిలోనూ; నాగుమాస్తా గూనైతేనేకేం? సొట్టై యితే నీకేం?"అనిఅడ్డువాదనకదిగాడు. కాని ఆవిడ వాల్చూపు

ఒకటిఅతనిమీదపారేసి"అయితే నామాటవినరు కాదూ?"అని సగందీనత్వంగానూ, సగం తాటించినట్లూ అనేసరికి రామయ్య రెడ్డిమెత్తబడిపోయాడు. వామాక్షివాలుచూపులకి మెత్తబడని పురుషుడుంటాడా మరీ ?- మూడేళ్ళు గడచినాయి. ఇంతలో ఒకనాడు ఆగృహిణి హటాత్తుగా ఆగుమాస్తాతోనూ, నగల పెట్టెతోనూ లేచి చక్కాపోయిందని వూళ్ళోవదంతి చెలరేగింది. తరువాతకథ, సంగ్రహంగా, యిదీ:—

పోలీసులు - సెర్చివారంటు - హజారాస్టేషను - ఎరస్టు-లంచం - గుప్ చుప్ !- కాని ఆగ్రామంలో ఆగుమాస్తాని తిట్టని పెద్దమనిషి లేడు. ఇదంతాచూచాడు మనగుంపన్న. "ఆడవాళ్ళు యెంతకైనా సాహసులురా, నాయనా ! కొంప తీసి నేనేగుమాస్తానయ్యుంటే నాకేంబుద్ధిపుట్టేదో! ఇంతకూ పైచవులుమరగిన ఆడదానికి వాడేమిటి, వీడేమిటి ? నాగూని ధర్మమాఅని నేను బ్రతికిపోయాను. నాకు గూనిప్రసాదించిన బ్రహ్మకి నూరునమస్కారాలు."

*  *  *

కొన్నాళ్ళకి గుంపన్నకికూడా యౌవ్వనం అంకురించింది. గూనైతే వుండొచ్చుగాని, కాలానుకూలంగా హావభావాలు మారవూ, మరి ? యౌవ్వనం పొడచూపేసరికి గుంపన్నకి కూడా నూతనభావా లుదయించినాయి. వీపుమీద గూని కాని, మనస్సుకి గూనిలేదుగా, మరి ? గుంపన్నకూడా ఆడపిల్లలవైపు. వెర్రిచూపులు చూడ్డం ప్రారంభించాడు.

ఆవూళ్లో శ్యామల మంచిచక్కనిపిల్ల. స్కూలుఫైనలు చదువుకుంటూంది. అతివయ్యారంగా నడిచేది. పదిహేనేళ్ళ వయస్సు. వయస్సుకు సరిపోయినట్టుగా శరీరంలోమార్పులు

కనుపిస్తూన్నవి. ఆమె నడుస్తూంటే గాలిలోంచి సున్నితంగా ఎగిరిపోయే ఒకదేవకన్యలాగు కనుపించేది. లోలాకులు వుయ్యాలలూగుతూండగా ఆమె అతిధీమాగా నలుగుర్నీచూస్తూ మందహాసం అనేవెన్నెల నలుదిక్కులా ప్రసరింపజేస్తూ సాయంకాలం పార్కునుంచి యింటికిపోతూంటే, ఆమెను చూచి చకితులైపోయేవారు కుర్రాళ్ళంతా ఎవళ్ళమట్టుకి వాళ్లే, "నన్నుచూచి నవ్విందంటే, నన్నుచూచినవ్వింద"ని మురిసిపోతూండేవారు. ఒకనాడు శ్యామల గుంపన్నవైపూ చూచి నవ్వడం సంభవించింది - అదెలాగంటే: సాయంకాలం. ఎలక్ట్రికుదీపాలు అప్పుడేవచ్చాయి. శ్యామల పార్కునుంచి యింటివైపు పోతూంది. గుంపన్న కోవెల్లో హరికథవిని అటుంచివస్తున్నాడు. శ్యామల సిల్కుచేరుమాలు ప్రమాద వశాత్తూ చెయ్యిజారి రోడ్డుమీదపడింది. గుంపన్న కప్పలాగు గెంతుకుంటూ పోయి, రుమాలుతీసి, దులిపి, శ్యామలకందిచ్చాడు. శ్యామలనవ్వుతూ, "Thank you, very much" అంది. "Don't mention, please" అన్నాడు గుంపన్న, నవ్వుతూను.

"But we will mention it to all, please" అన్నారు పక్కని చెరువుగట్టుమీద కూర్చొని ఇదంతా కనిపెడుతూన్న నలుగురు తుంటరికుర్రాళ్లు.

"గూనివాడుకూడా ఒక కథానాయకుడౌతున్నాడురోయ్" అన్నాడు మరొకడు. గుంపన్న మనస్సు పాదరసంలాగు పరుగెత్తడం ఆరంభించింది. శ్యామల నాడునవ్విందంటే నిజంగా తన్ను ప్రేమించిందనే అనుకున్నాడు. పాపం! శ్యామల తన గూనిచూచి సగర్వంగా వెక్కిరింతనవ్వు నవ్విందని అతనికి

తెలిసిందికాదు. మరి నెలరోజులకే శ్యామలను విశ్వపతిరావు అనే అబ్బాయికిచ్చి పెళ్లిచెయ్యడానికని ప్రధానం చేశారు పెద్దలంతాకలిసి. గుంపన్న గుండెకాయ, చెక్కలైపోయినట్ట యింది. శ్యామలవిషయంలో తనపొరపాటు గ్రహించాడు, గుంపన్న. క్రమేణ చెక్కలైపోయిందనుకున్న అతని గుండె కాయ మళ్లీ కలిసిపోయినట్టయింది. ఇంతలో యుద్ధంవచ్చింది, విశ్వపతిరావునే కాకుండా, ఆవూళ్లో యువకులందరినీ Active Service కి నిర్బంధించారు గవర్నమెంటువారు. గూనివాడు కాబట్టి గుంపన్న తప్పుకున్నాడు. విశ్వపతిరావు వెళ్లిపోతే శ్యామల తన్నేపెళ్లాడ్డానికి మంచిఛాన్సు వుందనుకున్నాడు గుంపన్న. సేనలోచేరబోయే యువకులంతా వెళ్లేరోజువచ్చింది. శ్యామల విశ్వపతి భుజంమీద శిరస్సువంచి వెక్కివెక్కి యేడుస్తూంది.

శ్యా:—విశ్వం, నువ్వు యుద్ధభూమినుంచి జయంపొంది వచ్చేవరకూ నీనామమే జపిస్తూంటాను.

విశ్వ:—మన యిరువురి ప్రేమపరివాహానికి భగవంతుడు ఇల్లాంటి అవరోధం కలిగిస్తాడనుకోలేదు, శ్యామలా. కాని నీవుధైర్యంగా, ఉత్సాహంగా వుంటానని ప్రమాణం చేస్తే, నేను ధైర్యంగా రణరంగానికి పోతాను. ఊరడిల్లి నన్నుపంపించు.

శ్యా:—సరే. జయంపొంది తిరిగిరా. కాని నువ్వు ఒకయేడాదిలో తిరిగిరాకపోతే, నేను కృశించిపోయి, అలాగే ప్రాణాలు వదిలేస్తాను, నీనామాక్షరాలు పెదవులమీద నుంచుకొని.

విశ్వ:—నెలకు రెండుత్తరాలు రాస్తుంటాలే. (అని ఆమె చెక్కిలినొక్కి, ముద్దెట్టుకున్నాడు.) గుంపన్న యిదంతా కనిపెడుతూనే వున్నాడు. దుఃఖం పట్టలేకపోయాడు. "పవిత్ర మైన ప్రేమంటే, విశ్వం, శ్యామలదే" అనుకున్నాడు.

విశ్వపతిరావు యుద్ధానికి వెళ్ళిపోయిన మూడు నెలలకే శ్యామలని ఒకపుస్తకాల వర్తకుడైన శ్రీనివాసం అనే అబ్బా యికిచ్చి, ఆపెద్దలే, ఎవరైతే శ్యామలని విశ్వానికిచ్చివివాహం చేద్దామని ప్రధానంచేశారో, ఆపెద్దలే-ముడెట్టేశారు. పెళ్ళవ డమే వాళ్ళకి కావాలిగాని, ప్రేమవ్యాసు వాళ్ళకెందుకూ? ఈవిధంగా శ్యామల విశ్వపతిరావు పట్లచేసిన శపధాలన్నీ గాలిబుంగల క్రింద ఎగిరిపోయాయి, శ్యామల శ్రీనివాసానికి 'ధర్మపత్ని' అయింది, పెద్దల ధర్మమాఅని.

ఒకనాడు గుంపన్న డైరీకొందామని శ్రీనివాసం యింటికి వెళ్ళాడు. యింటిసావడిలోనే షాపు. శ్రీనివాసం, లోపల భార్య శ్యామలతో ఏదో ఘర్షణ పడుతూన్నట్టయింది శ్యామలనోరు మహాఎక్కువ ధాటీగా వినిపిస్తూంది. కేకలు సావడివేపునకే వస్తూన్నవి. ఇంతలో శ్రీనివాసం ముందుపరు గెత్తుకుంటూ వచ్చాడు. ఆవెనక శ్యామల,-భీకరమూర్తి, నిజంగా అపరకాళికా దేవివలెనుంది. అది భార్యాభర్తలకల హం, కేవలం మాటలతోనే అంతమయ్యేటట్టు కనిపించలేదది. శ్యామల చేతులో దొడ్డిచెంబున్నది. శ్యామలకోపోద్రేకతు రాలు. మహావిష్ణువు చక్రం వొదిలినట్టుగా ఆదొడ్డిచెంబు గురిచూచి శ్రీనివాసం తలమీదవు పడిచిపెట్టింది. టంగ్ మని శబ్దం, అటుతరువాత శ్రీనివాసం తలకాయ రక్తంతో తడిసి పోవడం. శ్రీనివాసం తలరెండుచేతులతో పట్టుకొని కుర్చీలో

చతికిలబడడం ఇదంతా మూడు క్షణాల్లో జరిగిపోయింది. ఈ వ్యవహారమంతా గుంపన్న చూచాడు. "నాకు గూనివుండి పోబట్టికాని, లేకపోతో-నన్ను, శ్యామల పెళ్ళాడితే-నాగతి ఏమైయుండును? నాగూనికి వెయ్యి నమస్కారాలు"అనుకుంటూ షాపులోనుంచి వీధిలోకి ఒకటే కుప్పిగంతు వేసి నిష్క్రమించాడు.

సతీపతుల కలహం కళ్లారా చూచిన గుంపన్నకి పెళ్లి అంటేనే ఏవగింపు కలిగింది. పెళ్లాడితే తన స్వేచ్ఛకి భంగం అనుకున్నాడు. విచ్చల విడిగా బ్రహ్మచారిగా వుండిపోయి జన్మాంతం చూసేద్దా మనుకున్నాడు. ఒకనాడు బ్రహ్మచారి గుంపన్న, సాయంకాలం షికరుపోతూండగా:- ఊరుబయట-చిన్నఅడవి ప్రదేశంలాంటిది క్రింద పడివున్న ఒకచింత మొద్దు మీద, ఒక పురుషవ్యక్తి, సైనికదుస్తులు వేసుకొని కూర్చొని వున్నాడు. అంధుడు, దిక్కు తెలియక తలమాత్రం అటూ యిటూ తిప్పుతూవున్నాడు. ఆసంధ్యాకాలపు జబ్బుకాంతులలో దారిబోయేవారిని దమ్మిడీలిమ్మని గొంతెత్తి యాచిస్తున్నాడు. "కళ్లులేని కబోదుని, బాబయ్యా, చూడ నేత్రాలు లేవు, అమ్మల్లారా, నాజోలిలో ఒకదమ్మిడీ పడియ్యండి బాబుల్లారా" అని తన యాచనే ఒకపాటగా చేసి, ఆర్తనాదం చేస్తున్నాడు.

గుం:—ఏయ్, అబ్బీ! చెయ్యిపట్టు ఒక డబ్బు వేస్తా.

వ్యక్తి:—మెడలోవున్న నాజోలిలో పడీయండి బాబూ

గుం:—నీజోలి నేనుఅంటను. చెయ్యిపట్టు.

వ్యక్తి:—రెండు చేతులూ లేవండి, బాబయ్యా.

గుం:—ఏమిటీ! నీచేతులురెండూ ఏమైనాయి? (తనలో) కంఠస్వరం పరిచితమైనదానిలాగున్నదే!

వ్యక్తి:—యుద్ధంలో గుండుదెబ్బలు తగిలితే, ఆస్పత్రిలో తీసిపారేశారు, బాబయ్యా.

గుం:-కొంపతీసి నువ్వు మావిశ్వపతిరావు కావుగదా?

వ్యక్తి:—నాపేరు అదేనండిబాబయ్యా. తమరెవరండి?

గుం:—ఈవూర్లో గుంపన్న నెరుగుదువ్? నేను గుంపన్నని. పాపం! విశ్వం, నీస్థితిచూస్తే నాకుచాలా దుఃఖంగావుంది. ఇకను నీజీవితం ఎలాగుగడుస్తుందా, అని నేనాలోచిస్తున్నాను. అప్పటిస్థితికీ, ఇప్పటిస్థితికీ, ఎంతవ్యత్యాసం? ఆహా! ఏమిమార్పు! అద్భుతం, ఈశ్వరలీల!

విశ్వ:—శ్యామలబాగుందీ?

గుం:—శ్యామలకేం, బంగారుతల్లిలాగుంది. ఆమె రేపో నేడో ఒకశిశువుకి తల్లికాబోతుంది. నీళ్ళాడే పొద్దులామెకు.

విశ్వ:—చాలా సంతోషం. శ్యామలకు వివాహం అయిందంటే నాకు పరమసంతోషం. వెర్రిమొగంలాగు నాకోసం ఎదురుచూస్తూ బ్రహ్మచారిణై కూర్చోకుండా!-

గుం:—ఆలా అనుకోడం నీవెర్రి!- నువ్వువెళ్ళిన మూడుమాసాలకే 'భారతీ బుక్‌స్టాలు' మేనేజరు శ్రీనివాసాన్ని పెళ్ళిచేసుకుంది.

విశ్వ:—వాళ్ళిద్దరూ సుఖంగావున్నారు, నాకంతే చాలు.

గుం:—కావలసినంత సుఖం - సుఖానికేం?

అని గుంపన్న పూరుమార్గం పట్టాడు. "ఆహా, దైవ సంకల్పం. ఒకప్పుడు స్ఫురద్రూపినని మురిసిపోతూండిన విశ్వపతిరావుకి అంగవైకల్యం, అంధత్వం! నాలాగు గూని వుండి వుంటే తనకీబాధ తప్పిపోనుకదా!- నాగూనికి పదివేల నమస్కారాలు!"- ఇటువంటి ఊహలలో గుంపన్న తనయిల్లుచేరి పడకకుర్చీలో చేరపడ్డాడు. "బాబూ, స్నానానికి వేడినీళ్ళు కాగినై" అన్నది పనిమనిషి అంకమ్మ.

* * *

ప్రతీమనిషికీ ఏదోఒకగూని ఏదోఒకలోపం అనిమనం అనుకోనేది,- ఏదో ఒక లోటుబాటు వుంటూనేవుంటుంది. అలాంటిలోపం వుండడమే మంచిదనుకోండి. అలాంటి లోటుబాటువల్ల మనకెంతలాభంవుంటుందో మనం ఊహించలేము, నిజంగా. అది దైవేచ్ఛ. దైవం అలాంటిలోపం మనలోవుంచినందుకే మనం కృతజ్ఞులమై యుండాలి. సెలవు.



## —: ఇందువచ్చేవారు :—

---

### పురుషులు.

రాజావారు.

రాజావారి తమ్ముఁడు.
(పేరు బూటకరావు బహద్దరు)

మంత్రిగారు.

దర్వాన్ (పేరు నెమలయ్య)

బోయగురవడు.

దాసరి. (ఇతడిది కేవలం వట్టివేషం. నడకే, మాటా మంతీ యేమీవుండదు.)

### స్త్రీ.

గౌరి. (గురవడికూతురు)

---

# గౌరికోసం

## [ఏకాంకిక]



౧

[స్థలం:—మహారాజావారి మహలులో ఒకగది. రాజావారు సోఫాకు చేరబడి హుక్కా త్రాగుతూంటారు. నిషాచేత అర మోడ్పు కనుదోయి. వయస్సు 56 అయినప్పటికీ, 45 వలె కనిపిస్తారు, మీసాలకి రంగు, కట్టినదంతాలు - మొదలైన తెచ్చిపెట్టుకున్న ఆడంబరముచేత విలాసపురుషుడని ముఖం స్పష్టంగా చెబుతూంటుంది.

సమయం:—మధ్యాహ్నం రెండుగంటల వేళ.]

(ప్రవేశము:—దర్వాన్ నెమలయ్య - నెమలయ్య రాజావారికి వంగి మూడుసార్లు సలాంచేసి, చేతులుకట్టుకుని)

నెమ:—మహారాజుగోరి సౌఖ్యానికి బంగిమం కాకపోతే - ఏలినవారి దర్శనానికి పెధానమంత్రిగారు వచ్చి హజారంలో నిరీక్షిస్తున్నారు.

రాజా:—(కన్నులు కొద్దిగా తెరిచి) - ఎవరు ?

నెమ:—మంత్రిగారు.

రాజా:—కాదు, నువ్వెవరు ?

నెమ:—నేను, ఏలినవారి భృత్యుణ్ణి, నెమలయ్యని, మహాప్రిభో !

రాజా:—ఓ - దర్వాన్ - ఏమివచ్చావ్ ?

నెమ:—చిత్తం, దేవా, ఏలినవారి దర్శనం ఉత్ప్రేక్షించి మంత్రిగారు హాజారంలో నిరీక్షిస్తున్నారని మనవిచేసుకుందుకు వొచ్చాను.

రాజా:—రేపుదర్బారులో 12 గంటలకి కలవమని నాఆజ్ఞగా చెప్పు.

నెమ:—చిత్తం, చిత్తం - చాలాముఖ్యమైన పనని మంత్రిగారు సెలవిచ్చారు. ఇసంబం చెయ్యడానికి వీలులేదని చెప్పమన్నారు. శ్రీవారికి ఏలినవారికి, ప్రైవేటుగా - ఏదోవిషయం - మనవిచే...-

రాజా:—నెమలయ్యా, ఆమాట మాకుముందెందుకు చెప్పావుకావూ ?- నువ్వు, పరుగునావెళ్ళి, దివాన్‌గారిని శీఘ్రంగా ప్రవేశపెట్టు.

నెమ:—చిత్తం, దేవా ! (పరుగునటిస్తూ, నిష్క్రి.)

రాజా:—(తనలో) ప్రైవేటుగా - ఏదోవిషయం- ఊఁ - ఏవిఁటో, ఆప్రైవేటువిషయం ? దేశంలో, యెక్కడా శాంతిఅన్నమాట లేదు. మాకు, బొత్తిగానేలేదు. కాస్సేపు నిశ్చింత హుకా్కా కాల్చుకుందామంటే సమయం దొరక్కుండా వుంది - ముఖ్యమైనపని !- అంటే - బహుశా - ధనాగారంలో ధనమంతా అయిపోయిందని చెప్పడానికి వచ్చివుంటాడు. మేము, గొప్ప జమీందారులమన్న మాటేకాని, మాకెప్పుడూ డబ్బిబ్బందేగా ! (మూతి తుడుచుకుని, మీసాలు మెలిపెడుతూంటాడు.)

(ప్రవేశము:—మంత్రి, నెమలయ్య)

రాజా:—(మంత్రికి కుర్చీచూపిస్తూ) దయచేయండి, దివాన్జీ! (మంత్రిసావధానంగా కూర్చుంటాడు) ఏమిటి, సంగతి?

మంత్రి:—చాలా ముఖ్యమైనవిషయం మహారాజా. (అతి దీనత్వంగా, కొంపపోయినట్టు మొగంపెడుతాడు.)

రాజా:—(ఆత్రుతగా) ప్రజలూ, రైతులూ, ఎవరైనా తిరుగుబాటు చేస్తున్నారా ?

మంత్రి:—అబ్బే, అదికానేకాదు - మనప్రజలు వట్టి మేదకులు - కేవలం గంగిగోవుల్లాంటివాళ్లు. నెత్తురు వచ్చే వరకూ పన్నులుపితికినా, ఏడుస్తూ వూరుకుంటారు - ఇప్పటికింకా ప్రజలఏడుపువరకే వచ్చింది వ్యవహారం, ఇంకా తిరుగుబాటువరకూ రాలేదు, కథ. ప్రస్తుతంలో తిరుగుబాటుభయం తమకెంతమాత్రం అక్కర్లేదు, ప్రభూ !

రాజా:—శత్రుభయమైయుంటుందా ?

మంత్రి:—ఉద్దండరావు, భీకరరావు మొదలైన సేనానాయకులు, ఏలినవారిరాజ్యాన్ని - అనిమేషులై - అప్రమత్తులై - కాపాడుతూంటే - మనకా శత్రుభయం ?

రాజా:—(స్థిమితపడి) అయితే మరేమిటి ?

మంత్రి:—ఏలినవారి తమ్ములు, చిరంజీవులు, శ్రీబూటకరావు బహద్దరువార్ని గురించి -

రాజా:—మాతమ్ముడా ?. అయితేయేదో స్త్రీలంపటమయ్యుండాలి - అంతేనా ?

మంత్రి:—(గుటకలు మింగుతూ) చిత్తం, చిత్తం - ఏలినవారు సరిగా కనిపెట్టారు - అన్నీ తెలిసినవారికంతగా చెప్పక్కరలేదు.

రాజా:—క్రిందటిసారి భయంకరరావు కూతురు - ఈసారి యెవరో?

మంత్రి:—ఈసారి చాలా నీచమైనవిషయం! ఏలిన వారు క్షమించాలి.

రాజా:—(కళ్లెర్రజేసి) ఏమిటీ-రాణుల్లో ఎవర్నైనా-?

మంత్రి:—కాదు, కాదు దేవా - పాపము శమించు గాక! (తలవంచుకొని, విచారంతో తల మీదికీ క్రిందికీ వూపుతాడు) - తలుచుకుంటే - చాలానీచమైన విషయం!

రాజా:—ఏమిటా విషయం?- మంత్రిశేఖరా, నీళ్ళు నమలక అదేదో పైకితెమల్చండి వేగంగా!

మంత్రి:—మహారాణీ సర్కారువారి చిన్న దాసియొక్క సవారిమోసేటటువంటి, బోయగురవయ్య కూతురు!!

రాజా:—(నిర్ఘాంతపడి సోఫాకి చేరబడిపోతాడు) ఏమిటీ - మళ్ళీ - మ - మ - మళ్ళీచెప్పండీ, మంత్రీజీ!

మంత్రి:—బోయగురవడి కూతురు!- స్మశానందగ్గర మాలచెరువు గట్టుకిృంద గుడిసెలో వాళ్ళకాపురం - పిల్ల చాలా సౌందర్యవతి అంటున్నారు వూరంతాన్ను. కోటలోని స్త్రీజనం యావన్మందికంటే రూపసిఅంటున్నారు, మహాప్రభో! అప్పుడే నెలపదిహేను రోజులైంది - మనపట్నం యువకు లంతా - మాలచెరువుగట్టున ఉదయం, సాయంకాలం ఆపిల్ల దాన్ని చూడడానికి - ఈగలు ముసిరినట్టు ముసురుతున్నా రుట! ఆపిల్ల - చెరువుకి స్నానానికీ, నీళ్ళకోసం వచ్చిపోతూం టుందిట. ఆమెసౌందర్యం చెప్పుకుంటూ పట్టణమంతా తల క్రిందులైపోతూంది!

రాజా:—(ఆలోచనాతత్పరుడై) అసంభవము - నమ్మ డానికి వీల్లేకుండావుంది !- మంత్రీ, నేనునమ్మజాలను (ఉత్తేజుడై) చంద్రవంశంలో తిన్నగా సంబంధంకలిసిన మావంశంలోని ఒకానొక రాకుమారుడు - బోయవానికుమార్తెను !- హేయము !- నీచము !- కానేరదు - ఎంతమాత్రమూ కానేరదు!- మంత్రీ ఈవిషయంలో మీరేదో పొరబడ్డారని నావూహ !

మంత్రి:—లేదు, మహారాజా !. నేనుచెప్పినది ము మ్మాటికీనిజం !- నాచెవులతో నేనువిన్నాను, నమ్మకస్తుల ద్వారా !- ఆచెరువు గట్టుదగ్గర - ఏలినవారు మన్నించండి - శ్రీవారి తమ్ముడుగారు కాచివుండి, ఆపిల్లది - చెరువులో స్నానంచేసి తడిబట్టధరించి వస్తూంటే - క్షమించండి దేవా !- దృశ్యాదృశ్యమైన ఆమె అంగసౌష్టవాన్ని చూచి ముగ్ధులైపో తూంటారని నేను చెవులార విన్నాను, ప్రభూ !- ఆయన - ఆపిల్లని - బలాత్కారంగా ఎత్తుకుపోయి, రాక్షసవివాహం చేసుకునేందుకు - ప్రయత్నిస్తున్నారని తోస్తుంది !

రాజా:—రాక్షసవివాహము !- కాదు - అది, పైశాచిక లాలసకాని, వేరుకాదు. బోయపిల్ల నెత్తుకుపోతాడేం ?- ఎత్తుకుని పోతాడుగా ?- ఊఁ—అయితే ఎప్పుడెత్తుకుపోతాడు?

మంత్రి:—రెండుమూడు దినాల్లో !

రాజా:—వీలులేదు - ఆకృత్యంఎన్నటికీ జరుగనేరదు- నేను జరుగనీయను !- రాజునైన నేను - ఆటంకపరుస్తాను !- తమ్ముడైయ్యేది, ఎవ్వరయ్యేది, వాడి 'ఎరెస్టు'కు హుకుం జారీచేస్తాను ! (రోషావేశుడౌతాడు)

(కొంచెముసేపట్లేయుండి, ఆలోచనలోపడి) అయితే మంత్రిజీ !- ఆపిల్లని - మీరు చూచారూ ?

మంత్రి:—ఆఁ! (అని సందేహించి) లేదు, చూడ లేదు ప్రభూ!

రాజా:—అయితే, ఆపిల్ల చాలాఅందమైనదని మీకేం తెలుసును!

మంత్రి:—అంటే - మరి - అనగా - ఊరంతా అనుకున్నమాట!

రాజా:—(వెర్రినవ్వుతో, ఆతురతగా) ఆపిల్ల సౌందర్యంగురించి అంతా ఏమనుకుంటున్నారు, మంత్రి!

మంత్రి:—ఆపిల్ల - సన్నంగా, పొడుగ్గా వుంటుందిట!-

రాజా:—(అంగీకారం, ఆనందం సూచించేటట్టు బుర్ర వూపుతాడు) - ఊఁ.

మంత్రి:—పిరుదులుదాటి పడే నల్లనిజుత్తు!

రాజా:—ఉంగరాలుజుత్తా?

మంత్రి:—కాదుట - సాఫైన నునుపుజుత్తేనట! చక్కని చక్రాల్లాంటి కాటుకకళ్ళు!- వాటిమీాదను తీర్చిదిద్దినట్టు బొమలు!- ఇక కిందికిపోగా——

రాజా:—సరే, అష్టేపరిశీలనెందుకు, చూడనిదానికి?- కాని, ఇపుడు మీవర్ణనబట్టి పిల్ల చక్కనిదైవుండాలనే మా యొక్క అభిప్రాయమున్ను. ఆపిల్ల ఛాయగురించి ఏమనుకుంటున్నారు?- శరీరచ్ఛాయ?

మంత్రి:—చక్కని చామనచాయట! కుర్రాళ్లంతా ఆ చామనచాయనుంచే ముగ్ధులైపోతున్నారుట ప్రభూ! శాస్త్రంలో ఏమన్నాడంటే, చామనచాయగల చాన - భర్తని - ...

రాజా:—(పరధ్యానంగా) శాస్త్రం, గీస్త్రంమాటకేం గాని - చామనచాయైతే - నిజంగా - చాలా చక్కనిచాయి! (అంగీకారభావంతో తలవూపుతాడు.)

మంత్రి:—(రాజుయొక్క స్థితిచూచి, గ్రహించి) కాని,- ప్రభూ! మనం - ఒక్కవిషయం, మరచిపోకూడదు - అదేమిటంటే, ఆపిల్ల ఒకబోయవాని కూతురు. తక్కువజాతి- అతి తక్కువజాతి-బోయ- చండాలిని అన్నమాట!

రాజా:—(త్రుళ్లిపడి, ఏవగించుకొంటూ) ఊఁ! ఇంచుమించుగా చండాలిని!

మంత్రి:—ఆసంగతొకటి తలుచుకుంటే నాకు శరీరం గరపొడుస్తోంది!

రాజా:—నాకూ గరపొడుస్తూంది!

(ప్రక్కగానున్న నెమలయ్య, ఆశ్చర్యంతో
కళ్లు బాగావిప్పి, తనలో)

నెమ:—(తనలో) నాకూ, ఈగరపొడుపులతో భూమి గజగజలాడుతూన్నట్టుగా వుంది!

రాజా:—మంత్రీ, అయితే, మాతమ్ముడుసంగతి పట్నమంతటా పాకిందా, లేక -?

మంత్రి:—లేదు. ఇంకా బాగాప్రచారంలోకి రాలేదు. గోడలమీద మసిబొగ్గువ్రాత లేమీ, యింకా కానరావు. ఎవళ్ళో, ఒకరిద్దరు కుర్రాళ్లుమాత్రం చెరువుగట్టున, నాలుగైదుసార్లు, అతగాడు, ఆపిల్లనిచూచి దగ్గడం, సకిలించడం, చూచినట్టుగా నాకు తెలిసింది. నిజమో అబద్ధమో కాని, నిన్నట్నుంచీ - ఆ అమ్మాయీ, అతడూ - రహస్య సంభాషణలు సాగిస్తూన్నట్టుగా కూడా - వినికిడి!

రాజా:—మంత్రిపుంగవా! మనం - ఈవిషయంలో - జాగ్రత్తగా మసలాలి. (ఆలోచించి) వినికిరి! - వి-ని-కి-రి!!- సరే - మావాడు ఈవేళ రాత్రి, అనగా రేపు తెల్లారేలోపున, ఆపిల్లని, ఎత్తుకుపోతాడనే, తమ అభిప్రాయమా?

మంత్రి:—వ్యవహారం ఇంకాఅంతమట్టుకు ముదరలేదనే నాఅభిప్రాయం - ఈరెండురోజుల లోపున అట్టిప్రమాదం సంభవింపకూడదనే వదంతిబట్టి గోచరిస్తూంది, నాబుద్ధికి -

రాజా:—(పరధ్యానంగా) అయితే మన ప్రయత్నానికి వ్యవధి ఉందన్నమాటే -

మంత్రిజీ, మనం ఈవిషయంలో అతి జాగరూకులమై యుండాలి! అదికాక మనఆలోచన, మనయిద్దరిలోనే వుండాలి!

(చాటుగా నిలబడిన నెమలయ్య, గుడ్లు మిటకరించి బాగా చాటుకి జరుగుతాడు)

ఈలాంటి సందర్భాల్లో తొందరపాటెంతమాత్రం పనికిరాదు - ఏమంటారు?

మంత్రి:—(అంగీకార సూచనగా తలవూపి) ఔను.

రాజు:—తొందరపాటువల్ల కార్యం రసాభాస కావచ్చు - ఇంతకూ, ఈసంగతి మనం విన్నదికాని - కళ్లారా చూచినది కాదు! అందుచేత మనం తొందరపడ్డామో, అనవసరంగా రాజ్యం గగ్గోలెత్తిపోతుంది. రాజ్యానికీ, రాజవంశానికీ లేనికళంకం మనమే తెచ్చిపెట్టినవాళ్ల మౌతాము. అందుచేత మీకుతోచిన ఉపాయం ఉపాయం ఏమిటంటే:- తమ్ముణ్ణిడు, ఉదయం, సాయంత్రం కోటకదలకుండా ఉత్తర్వు చేద్దాం! మీరేమంటారు?

మంత్రి:—చిత్తం ఏలినవారి ఆజ్ఞకి తిరుగువుంటుందా?

రాజా:—మంత్రీ, మీరు - ఆకుర్రదానిమీద ఒక కన్నుంచాలి. అంటే, మరేం కాదు (మంత్రి నెరిసినజుత్తు తణుముకుంటాడు) ఆపిల్ల ఉద్దేశాలు ఎల్లాంటివో - అసలాపిల్ల ఏరకమో, మీరు తెలుసుకోవాలి.

మంత్రి:—(ససంభ్రమంగా) చిత్తం, చిత్తం, ఏలినవారి ఆర్డరుకి తిరుగు వుంటుందా? తప్పకుండా, మీరుచెప్పిన విషయాలన్నీ - ఓడ్చి, వడబోసి, మరీచూస్తాను. సెలవుపుచ్చుకుందునా?

రాజా:—అటుపిమ్మట - మంత్రీజీ - మరి - ఆపిల్ల - నిజంగా - అంతమనోహరంగా - వుంటే (తిరిగి ఆలోచిస్తాడు)

మంత్రి:—చిత్తం- ఆసంగతికూడా, నేను, స్వయంగా పరిశీలిస్తాను - శ్రీవారిఆజ్ఞ శిరసావహించడానికి, ఈసేవకుడు సర్వకాల సర్వావస్థలయందూ-సిద్ధంగా వుంటాడని, నమ్మండి, దేవా! (రాజుముఖం కనిపెట్టి, అతడు మోహసముద్రంలో కొట్టుకుపోతూన్నట్టు గ్రహించి, తలవూపి) ఇంతకూ. బోయవాని కూతురేమిటి, రాచబిడ్డ నాకర్షించే సౌందర్యం కలిగి వుండడమేమిటి? బాగా ఆలోచించగా - నాకు - ఇదంతా - అబద్ధమేమో అనిపిస్తూంది.

రాజా:—నిజంకాకపోవాలనే, నాఆశ! లేకపోతే చిరంజీవి మాతమ్ముడు నిష్కారణంగా నిందితుడౌతాడు. ఈసంగతి అబద్ధం కావాలనే నేనుమనసార కోరుతున్నాను.

మంత్రి:—ఇది నిజంకాకపోవలనే, నా ప్రార్థన కూడను !- స్వచ్ఛమైన స్ఫటికంలాంటి రాజవంశానికి మచ్చ తేకుమా సర్వేశ్వరా - అని - నేను నేటిఉదయంనుంచీ ప్రార్థన చేస్తూన్నాను!

రాజా:—ఊరంతా అనుకున్నట్టుగా, ఆపిల్ల - అంత చక్కగావుంటే -! ఏమిటో - స్వయంగా చూస్తేనేకాని నే నేమీా చెప్పలేను!

మంత్రి:—తమ కెందుకూ శ్రమ? - ఫిల్ని వాటితరఫున నే నేచూచి అన్ని సంగతులూ, తప్సీలుగా మనవిచేసుకుంటాగా ప్రభువారికి ?

రాజా:—సరే. రేపుఉదయం నాకు తెలియబర్చండి. సరిగా ఎనిమిదిగంటలకి, తెలిసిందా ?

మంత్రి:—అవశ్యం !- సెలవు ! (రాజుకి నమస్కరించి ఒకవైపు నిష్క్రమిస్తాడు.)

(రాజు రెండవవైపు నిష్క్రమిస్తూంటే, చాటునున్న నెమలయ్య ఎదురుగావచ్చి, నవ్వుఆపుకునే ప్రయత్నంలో నాలుగైదుసార్లు దగ్గి, ఏమీాఎరగనట్టు 'ఎటన్షన్'లో నిలబడు తాడు. రాజు తుళ్ళిపడి, సర్దుకొని, రోషావేశంతో)

రాజా:—ఓరీ, దర్వాన్ ! నువ్వింకా ఇక్కడే వు న్నావూ ?- ద్వారంలోనిలబడి ఏడవకుండా, ఈమూాలనెందుకు నక్కావు, నువ్వు ?-

నెమ:—(వణకిపోతూన్నట్టు నటించి) చిత్తం, చిత్తం-ఏలినవారు అన్నంపెట్టించాలి - తల్లిదండ్రిల కొక్కణ్ణి, ఏలిన వారి సమక్షాన్ని, మంత్రిగార్ని ప్రవేశపెట్టినాక, ప్రభువు వోరు నన్నుపొమ్మని చెప్పలేదు. అంచేత, నాఅవసరం, ఏలిన వారికి, ఏమైనా వుండొచ్చుననుకుని, ఈవోర నిలబడ్డాను మాాప్రభో.

రాజా:—మేమూా, మంత్రీ మాట్లాడిన రాచకీయ రహస్య విషయమంతా నువ్వు విన్నావన్న మాట ?

నెమ:—లేను, మాపెభూ !

రాజా:—లేదూ, లేదూ ?- పుండాఖోర్ - అబద్ధ మాడుతున్నావు, మాయెదుట !

నెమ:—(వణకిపోతూ) ఏలినవారు రచ్చించాలి - ప్రమాణపూర్తిగా, నేను ఒక్కమాట వినలేను, దేవా !

రాజా:—ఇక్కడ నుంచున్నవాడివి, వినకపోవడం ఏలాగురా, పెద్దమ్మా ?

నెమ:—నా చెవులు రెండూ గట్టిగా మూసేసుకున్నాను మాపెభో !

రాజా:—నిజంగానూ ?

నెమ:—అబద్ధమాడితే నాపీక మొదలంటాకోసేండి దేవా !

రాజా:—(వికసించిన ముఖంతో) అయితే, నెమలీ, నేనూ, మంత్రిగారూ, మాట్లాడిన రాచకీయవ్యవహారం గురించి నువ్వేమీ వినలేదన్నమాట !

నెమ:—సత్తెప్రెమాణకంగా, ఒక్కమాట నాచెవి సోకలేదు.

రాజా:—మంచిది ! (నిష్క్రమణ)

నెమ:—(తనలో) రాజుగోరినీ, రాజుగోరి తమ్ముడు గోరినీ, రాజుగారి ముఖ్యమంత్రిగోరినీ - దివాణంలో దికదం తుల్లాంటి ముగ్గురిమొగోళ్ళని - ఒక్క 17 ఏళ్ళపిల్ల - అదీ, ఒక కడజాతి బోయపిల్ల - తుపానువచ్చి, పెద్దవృచ్చాల్ని పూపేసినట్టు, అమాంతంగా ఊపెత్తంచేస్తూంది - ఆగాలి - ఎవల్లకి తగుల్తాదో !-

[తెర]

# గౌరికోసం

## [ఏకాంకిక]



౧

[స్థలం:—రాజావారు రహస్యాలోచనలు సాగించేగది.
సమయం:—ఉదయం, ఎనిమిదిగంటల వేళ.]

(రాజు, మంత్రి మాట్లాడుతూంటారు)

రాజు:—అయితే, అంతప్రమాదమైన సౌందర్యంఏమీ లేదంటారూ, మంత్రీ!

మంత్రి:—ఎబ్బే!, ఏదో ఒకమోస్తరు! గ్రామ్యవాసుల్లోకల్లా నయం - అంతమట్టుకే.

రాజు:—కళ్లు, ఏలాగుంటాయి, ఆకురౌదానివి ?

మంత్రి:—అంత పెద్దవీకావు, అంత చిన్నవీకావు.

రాజు:—తక్కిన శరీరంమాట ?-

మంత్రి:—కొంచెం దిబ్బగానూ, మోటుగానూ వుంటుంది కాని మృదుత్వంఎక్కడా లేనట్టేవుంది, నామట్టుకి... ఇక, సున్నితం, నాజూకూ, వెతికినా కనుపించవు.

రాజు:—ఆఖరుకి, అంతే ?- నేచెప్పలే, ఇదంతా ఒట్టి ఆర్భాటమేనని ?

మంత్రి:—చిత్తం, జుత్తుకూడా, మనం నిన్ననుకున్నంత పొడుగ్గా వుండదేమో, అని నానిశ్చయం. మీదుమిక్కిలి అతి మోటుగా చుట్టబడి, ఒక చుట్టకుదురులాగుంది.

రాజు:—(నిరాశ సూచించేటట్టుగా, అవయవాలన్నీ వదులుగా ఎక్కడవక్కడ పడేసి, నిట్టూర్పు) శరీరచ్ఛాయ ?-

మంత్రి:—అబ్బే! పాలిపోయినట్టుగా - తెల్లని బల్లి రంగుగా - ఎట్టితేజస్సూ లేక - వున్నది. చిత్తగించారూ ?

రాజు:—(నిస్పృహగా) ఈమాత్రందానికేనా రాజధానిలో యువకులంతా తల్లడిల్లి వైతక్కలాడుతున్నారు ?

మంత్రి:—అంటే - ఎలాగైనా, కొద్దో, గొప్పో, అందంగావుంటుందనే అనుకోవాలి అనుభవ వైద్యులమైన మనకి అంతగానచ్చకపోయినా, కుర్రముండావాళ్ళని కూడ దీసేటటువంటి ఆకర్షణశక్తి లేకపోలేదు - లేకపోతే పట్నపు యువకులంతా ఎందుకుపోతారామెవెంట ?- కాని, నిన్న మనం అనుకున్నట్టు కోటలోని స్త్రీజనం సౌందర్యంతో సరిపోల్చదగినది ఎంతమాత్రమూ కాదు !

రాజు:-(ఏమీతోచనివానివలె చూస్తూ) అయితే మా తమ్ముడు, ఈరొంపిలో ఎలాగుదిగబడ్డాడా అని నాఅనుమానం !

మంత్రి:—అదే, నాకూ, నిన్నసాయంత్రం ఆపిల్లని చూచినప్పట్నుంచీ, సందేహం కలుగుతూంది.

రాజు:—మావాడు, ఇంకా మాలచెరువుగట్టుకి వెళ్తున్నాడూ ?

మంత్రి:—చిత్తం. నిన్నను నేను తమఆజ్ఞాను సారంగా, ...

రాజు:—మంత్రీజీ, ఆపిల్లపేరేమిటో కనుక్కున్నారూ?

మంత్రి:—చిత్తం, గౌరి!- అంతమాత్రం కనుక్కో కుండా వుంటానా ?

రాజు:—గౌరి - గౌరి - పేరుచక్కనిదే!

మంత్రి:—నిన్ననునేను గౌరినిచూచి, గుర్రంమీద తిరిగివస్తూంటే, తమ తమ్ముడుగారుకూడా విలాసంగాముస్తాబై హస్తబలులోని అరబ్బీకంచన్‌మీద టక్ టక్ మని వెళ్లుతున్నారు. నన్నుచూచి, ఆయనముఖం ఒకకళ తగ్గిపోయింది కూడాన్ను - అనకూడదు కాని, నిజంగా - ఎంతటి హైన్యానికి దిగబడ్డారు!- నాకుతోచిన దేమంటే - (సందేహించును)

రాజు:—చెప్పండి, సంకోచింపక -

మంత్రి:—ఇది ఎంతమాత్రం మోహంకాదు! బహుశా ఏదైనా మంత్రప్రయోగంవల్ల - నాబుద్ధికి ఎలాగు తట్టుతూందంటే - శ్రీ తమ తమ్ముడుగారు పూర్తిగా ఆమంత్రశక్తికి వశులైపోకుండానే, శ్రీవారైన తమరు శీఘ్రంగా ఏదో ఒక ఉపాయుంపన్ని - ఆయన మాలచెరువువైపు వెళ్లకుండా చేసేడం మంచిది - లేకపోతే కర్పూరంలాగు కమ్మదనం వెదజల్లే తమవంశం కంపుకొట్టకమానదు - ఈవృద్ధమంత్రిమాట చెవినిపెట్టండి.

రాజు:—కాని, నామాటవింటాడూ, మావాడు ?

మంత్రి:—వినకేం ? ఏలినవాని ఆజ్ఞ జవదాటడానికి రాజ్యంలో ఎవ్వరికి సాహసంవుంది ?- రాజాజ్ఞ !-

రాజు:—మావాడికి రాజాజ్ఞ, గీజాజ్ఞ జాన్తానై.

మంత్రి:—అలాగైతే - రాజాజ్ఞ త్రోసిపుచ్చే పరిస్థితులేవస్తే, శ్రీవారి తమ్ముడుగారిని, రాజ్యంలోనుంచి నిర్వాసునిచెయ్యడం మంచిదని నావూహా! ఏదో ఒక foreign

town మిదపెట్టి, ఏ America కో, England కో వివాహానం మీద పంపించేయండి.

రాజు:—ఆవిషయమై నేను తీవ్రంగా యోచిస్తాను !

మంత్రి:—చిత్తం, నిజంగా, బాగా ఆలోచించవలసిన విషయం !- నాకు సెలవా, మరి ?

రాజు:—సరే -

(మంత్రి నిష్క్రమణ)

రాజు:—(తనలో) పట్నంలో మొగపురుషులన్నీ బెల్లాన్ని చీమలు వెంబడించినట్టు, ఆఅమ్మాయి వెనువెంటనే తగిలివుంటూంటే - ఈముసలిమంత్రి - ఏదో సాధారణమైన సౌందర్యం అంటాడే!- ఇందులో, ఏదోఒక పరమరహస్యం వుంది - లేదా, ఈ ముసలిమంత్రి మరొకపిల్లని చూచివుంటాడా ?- లేదా, మావాడు, మంత్రికిలంచమిచ్చి ఇలాగు చెప్పమనివుంటాడా ?- అలాగైతే, దేశంలోంచి వెడలగొట్టమని సలహాయిస్తున్నాడే !- ఏమిటో !- ఆలోచించినకొద్దీ ఇది చాలాచిత్రంగా కనిపిస్తూంది - నేనే స్వయంగాపోయి చూస్తాను - నాకళ్ళతో చూడాలి, ఏదైనా, నేనుసమ్మాలి - నాకళ్లు ! (Dressing table అద్దంలో ముఖంచూచుకొని) నాకళ్ళు - చాలా అందమైనకళ్ళని నాభార్యలు రోజూ అంటూంటారు !- - ఆపిల్ల - నిజంగా చక్కనిదేఅయితే - ఊం - ఇవాళ సాయంకాలమే - చీకటివేళ - మారువేషంవేసుకుని బయల్దేరుతాను - నెమలయ్యనికూడా నావెంట మారువేషంతో వచ్చేటట్టు ఉత్తర్వుచేస్తాను !- దర్వాన్‌కూడా వెంటనుంటే మంచిది: ఎటువంటి ఎటొచ్చినా పాపకృత్యాని కిన్ని పరియత్నాలు !- [తెర]

# గౌరి కోసం

## [ఏకాంకిక]



### 3

[స్థలం:—మాలపేటలోని బోయగురవడి పూరిల్లు.
సమయం:—మధ్యాహ్నం, మూడుగంటలవేళ.]

(గురవడు ఈతచాపమీద పడుకొని చుట్టకాలుస్తుంటాడు. వానికూతురు గౌరి, ద్వారాని కొకపక్కగా కూర్చొని చేటలోబియ్యం బాగుచేస్తుంటుంది. గౌరి నిజంగా చక్కనిచుక్క.)

గుర:—తల్లిలేనిపిల్లవు - నీకుతల్లయినా నానే, తండ్రయినా నేనేకాబట్టి - యింతమట్టుకి చెబుతున్నా. ఈడొచ్చిన పిల్లవు, పెపంచంనిండా యినవుముండాకొడుకులు నచ్చావ నచ్చులు. సాల జాగ్రత్తగుండాల!

గౌరి:—తెలిసింది, నాయనా! నువ్వులేనప్పుడు తలుపేసుకు కూకుంటా. నువ్వొస్తేనే తలుపుతీస్తా. ఇకబయమేటి?

గు:—చెరువుకేసి, స్నానానికి - నీళ్లుతేడానికి - ఎళ్లేటప్పుడు కూడా బవుజాగ్రత్తగుండాల. కాని ముండావోళ్ళు కాసుకొనివుంటారు. మీతల్లి - బ్రతికుంటే - నీకీకష్టమూ

తప్పిపొయ్యేది. నాకు బెంగలేకుండా పొయ్యేదికదా అని నా దుక్కం! (కన్నీరు తుడుచుకుంటాడు)

గౌ:—అదా, నాయనా, నీబయం? నీకలాంటి బయం అక్కర్లే! మాలపేట పిల్లలమంతా ఒక్కగుంపుగా కడవ లెత్తుకెల్లి, చెర్లో స్నానాల్చేసి, నీల్లు ముంచుకొత్తున్నాం, ఆడుకుంటూ, పాడుకుంటూ –

గు:—ఏమో, నాతల్లీ – నిన్నొకర అయ్యసేతులో ఎట్టి వందాక నాపానాలు కొట్టుకుపోతుంటాయి. కులం తక్కువ వోళ్ళమైనా గునం రచ్చించుకోవాలె, మాయమ్మా! పానా లైనా తీసి పారెయ్యొచ్చుగాని, మానంమట్టుకు పదిలంగా కాపాడుకోవాలి, నాతల్లీ!

గౌ:—కులం!– జాతి!– నాయనా – కులం, జాతి– ఇవి ఎవ్వారేర్పాటుసేసారు? మనుసులా, లేక భగమొంతుడా?

గు:—బగమొంతుడల్లాంటిపొరపాటు చెయ్యడు. బగమొంతుడు మనలాటివోళ్ళని చూసి అసయ్యించుకుంటే మన గతేంగావలె? మనకీ సల్లనిగాలి, రాత్రి పండొంటివెన్నెల. ఈసౌక్యాలు, ఆనందాలు, ఉత్సవాలు – ఇయ్యన్నీ ఎక్కణ్ణుంచి వొస్తాయి, ఈశ్వరుడివ్వకపోతే? ఈశ్వరుడి సూపులో మనమెంతో, మనరాజుగోరూ, అంతే – ఆతండికి, ఆ పరమేశ్వరుడికి, కులంలేదూ, జాతీలేదు! ఇవన్నీ మానవులు తెచ్చిపెట్టిన భేదాలేకావలె!

గౌ:—అదే, నేనూ అనుకుంటున్నా. మనిసికీ, మనిసికీ తారతమ్యం కులంబట్టికాదు, శీలంబట్టికాని. మనుసులు కల్పించిన కులగోత్రాలనిబట్టి, మానం, మర్యాదా నిర్ణయించలేము ఇప్పుడు, నానే ఉన్నాననుకో – నాశీలంనాది, అదిపవిత్రం

అని నాసుభావిస్తున్నానెప్పుడో - ఎప్పుడైతే నాశీలమే నా దేవుడని నాననుకుంటున్నానో - ఆపయిత్రిమైన శీలాన్ని రచ్చించుకోడం, నాకుయిధి - అదినామతం, అదినానోము, అదినాదీచ్ఛ, అదినాధర్మం, అదినాకు ఆనందం - ఆదేనాకు పాణం! తనముద్దు బంగారుపిల్లల్ని గద్దతాపులనుంచి పెట్ట కాపాడుకున్నట్టు, నాశీలంయొక్క సొచ్ఛత నాను కాపాడు కోగల్ను!- నలుగురుమొగోళ్ళు నన్నువెంటాడి నవ్వనీ - పదిమందొచ్చి నాయేపు పక్కసూపులు సూడనీ, నాకేం బయం?- పాపం వూహాలున్నవోళ్ళకి బయంకాని -?

గు:—నాబయంఏటంటే, నువ్వు అందరిపిల్లల్లోంటి అనాకారిదానివి కాకపోతివి. అప్పుడే ఇకసిస్తూన్న పువ్వు నాగు, కొత్తగా అంకురిస్తూన్న వొయిసు! మనవూరినిండా మంచీచెడ్డా తెలియని మతోయిన మొగోళ్ళు! సూడూ, సెప్తా: పువ్వులన్నింటిలో సౌందరియమైన పువ్వుమీాదే, అందరికళ్ళూ, దాన్నే తుంచిపారెయ్యడానికి సూస్తూంటా రందరూ!- కోటలోసంగతులు రోజూ సూస్తూంటానుగనక, నాకు బాగాతెల్సును - అందుకే నీకింతమట్టుకి చెబుతున్నా-

గా:—నాయినా! మొన్నసాయంత్రం ఏజరిగిందో తెలుసా? నానూ, మనపేటపిల్లలు కొందరూ నీల్లెత్తుకుని, చెరువునుంచి వొస్తుంటే, ఒకడు - రాజుతమ్ముడంట - నన్ను సూస్తూ పళ్ళుపైకెట్టి గుర్రంనాగు సకిలించాడు. నాకైతే మొదట బయంకలిగింది కాని, మళ్ళీ దైర్యం తెచ్చుకుని, కొంగూ కొసా సర్దుకొని, ఆడు నాకు ఎదురైతే బరువుకుండ నెత్తిని కొట్టేడానికి తయారైపోయాను.

గు:—ఒక్క ఆయనగోరేనా ?- నిన్న మాంత్రిగోరొ చ్చారా, మనయింటికి - ఆయన -

గా:—ఆ ముసలోడా ?

గు:—ముసలైతేయేం ? ముచ్చట్లతో మురిసిపో తూంటాడు, గొప్పోడుగనుక ! వాళ్లకి దనముండి, గొప్ప వోదావుంది. వాళ్ళేంజేసినా చెల్లుతాది.

గా:—ఈపీనుగులు నన్నేటిసెయ్యగలవు నాయనా ?

గు:—పోనీ, ఇంతనుందీ - గొప్పోళ్ళవొక్కళ్లో ముస్లి వోళ్ళనాగ నీయెనకాల తినుగులాడుతారు కాని, ముందు వొచ్చి, నిన్ను పెళ్ళిసేసుకుంటానంటారేమో సూడు !- ఆ ఫూసే యెత్తరు.

గు:—కులంతక్కువదాన్ని - నన్ను పెళ్ళిసేసుకుంటే, ఆళ్ళ గౌరవానికి బంగంకలుగుతాదని కాబోలు ?

గు:—ఆళగౌరవం అంతలోనేవుంది. రహస్యంగా ఎన్ని మాలకూళ్లు కుడిసినా, అవేం నెక్కకురావు.

గా:—ఎందుకు నెక్కకురావు ?

గు:—ఎందుకా ? రహస్యమని చెప్పాగా !- అందు చేత, నిలువునా అబద్ధమూడేసి ఏమీ ఎరగమనేస్తారు !

గా:—ఒక ఆడపిల్లయొక్క సౌందర్యాన్ని, ఒక మాన వొతియొక్క మానదనాన్ని సీకట్లో దొంగతనంగా ఎత్తుకు పోడానికి ఈళ్ళందరూ సిద్ధమే. కాని, ఆడదాని మానం యొక్క పౌయిత్రిత తెలిసికొని, మనసిచ్చి, పెళ్ళిసేసుకుని, చక్కని దాంపత్యసౌఖ్యాన్ని అనుబోగించడానికి, జాతిబయం ! కాలమహిమ ! ఈపురుసుల జీవితాలెంత తలకిందులైపో తున్నె !- ఇలాంటివోళ్ళని పురుసులనడంకంటె, పురుగులంటే

బాగుంటాదనుకుంటాను! ఇల్లాంటి సందర్భంలో - మనుసులు జంతువులకంటే - కిందిమెట్టున వున్నారని చెప్పవలసివస్తుంది.

గు:—సందేగమేంటి? దుష్టమెకం ఏటిచేస్తాది? దాని ఆకలిబాధ తీర్చుకునేందుకు, ఒకసిన్న చక్కని లేడిపిల్లకుత్తిక కొరికేసి, ఆ నులెచ్చని నెత్తురుపీల్చి, ఆమెర్రని దంతాల్తో అట్టాసంచేసి, రాకాసివలె రంకెవేసిపోతుంది - అదేయిధంగా రాకాసిబుద్ధికి వొసులైపోయిన ఈగొప్పింటి మొగోళ్ళంతా! తెలిచిందా - ధనంచేత, వోదాచేత, మత్తెక్కి ఎలాంటి పాప కార్యానికైనా తయ్యారైపోతారు! బగమొంతుడు, ఆళ్ళకి, ఇదిమంచి. ఇదిసెడ్డ - అని తెలుసుకోనేటట్టు బుర్రలో బుద్ధి పెట్టినా, ఆళ్ళు - ఆబుద్ధి, ఇనియోగించక, బుద్ధిపూర్వకంగా బగవంతుణ్ణే దిక్కరించేస్తారు!

గౌ:—అలాంటప్పుడు బగమొంతుడు ఆళ్ళకి చత్రువైపోడూ? ఆబగమొంతున్నే నమ్ముకున్న మాలాంటి నిరుపేదలకి - (పైకిచూసి) ఆఅయ్యా, ఆపదలన్నీ తొలగించడూ? ఆతెండ్రికి చేతకానిదేటుంది, లోకంలో! నాకు - ఒక్కఅతని సాయంవుంటే, నానెవ్వరినీ, లచ్చంచెయ్యను. నాయనా - రాజుతమ్ముడు కాదుగదా, ముఖ్యమంత్రి కాదుగదా - రాజునైనా - అటుండమంటాను, అన్యాయాని కొడిగట్టుకుంటే!

గు:—ఊరుకోవే, పిచ్చిపిల్లా! రాజుగోరికి తెలుస్తే కొంపపోతాది.

(ప్రవేశము : నెమలయ్య - ద్వారంలో)

నెమ:-(గౌరినిచూస్తాడు) బోయగురవయ్య యిల్లిదేనా?

(గౌరినిలబడి పక్కకితప్పుకుని తండ్రివైపుచూస్తుంది. గురవయ్యలేచి చాపమీదే కూర్చుంటాడు - కంగారుతో)

గుర:—నానే గురవయ్యానిబాబూ - ఓహో నెమలయ్యా!- నోపలికిరా, బాబూ!- నువ్వొచ్చి ఎంతచేపైంది, నాయనా!

నెమ:—ఇప్పుడే వొస్తున్నా. నీయిల్లు కనుక్కొండికి పావుగంట పట్టింది!

గుర:—పేదోళ్ళ గుడిసెలన్నీ ఒక్కనాగేవుంతాయి!- ఏటో!- పిల్లా, పీటట్టుకురా, నెమలయ్య కూకుందికి.

నెమ:—ఆఁ! పీటావొద్దు సేటావొద్దు - నీపక్కనే సాపలో కూకుంతాలే! (కూర్చొనును)

గుర:—జాతితక్కవోళ్ళం గందాని!

నెమ:—గురవయ్యా, నీది పలానిజాతిఅని నీమొగాన్ని రాసుందేమో, సూపించు! నానేటంటానో తెలుసా?- మనదంతా ఒకటేజాతి, మనిసిజాతి! తెలిసిందా?- అందులోకీ, ఇంతసుబ్బరతగావున్న ఈయింట కూకుంటేతప్పేటి? ఇందులో నాకేందోసం కనుపించలేదు. గురవయ్యా, నువ్వు రాబాయణం విన్నావూ?

గుర:—ఒక్కసారి, మాపేటని బొమ్మలాటాడినారు చివరాత్రికి -

నెమ:—అందులో, చబరిఅని ఒక - మీాబోయపిల్లె వొస్తాది. ఆపిల్ల గొప్పబకుతురాలు. శ్రీరాముడికి - ఆకలౌతుందని మొంచి-బత్తితో, కొన్నిపళ్లుపర్సి, కూర్సి, అవన్నిబాగా పండినాయో లేదోఅని, ఒకొక్కటి రుసూసి, ఆ రామయ్యకి సమరిపిస్తాది. ఆ మగానుభావుడికి భక్తే ముక్యం కాబట్టీ, ఆపళ్లు, కళ్ళకద్దుకుని భోంచేస్తాడు.

(ఇల్లంతా కలయజూచి, మూలనుంచుని కథవింటూన్న గౌరివేపు దృష్టి కొంచెంసేపు నిలబెట్టి) - ఇల్లాంటి యింట్లో, నిజంగా, ఇస్తరేసుకుని, బోంచేస్తే తప్పేటి, గురవయ్యా?

గుర:—ఉత్తనే అంటావుగాని, నువ్వుమాయింట నిజంగా బోంచేస్తావూ ?

నెమ:—చెయ్యకేం ? కావాలంటే దాకలాగా, నీపిల్ల నేమైనా యిమ్మను - భోంచెయ్యకపోతే చూడు - కోసెడు దూరం గుర్రంమీద దౌడుకొట్టి వచ్చేసరికి ఆకలౌతూంది, కూడా !

(గురవయ్య కుమార్తెవైపు చూస్తాడు. ఆపిల్ల ఫల హారం తేడానికి లోపలికివెళ్తుంది.)

నెమ:—ఈజాతిబేదవనేది ఒక ఇనప్పురుగు. దాని సిగ్గోయ్యా! మనసూద్రుల్లోనే యిన్నిబేదాలు. గాలికూడా సోకరాదన్నవాళ్ళుకొందరు, అందు అంటరానివాళ్ళుకొందరు, అడుగుదూరాన్ని కొందరు. అదిమనని మొదలంటాకోరికి పారేస్తున్నాది. నానవేది సుచి, సుబ్బరత, గుణం, సీలం వున్నప్పుడు జాతిమాటే తలచనక్కర్లేదు - అదినాకు తోసిన మాట - ఇన్నావా?

(గౌరి ప్రవేశించి, ఒక అరటిఆకులో ఫలహారంతెచ్చి నెమలయ్యముందు పెడుతుంది. నెమలయ్య, గౌరిముఖం దగ్గరా చూస్తాడు. ఆమె దృష్టికూడా ఒకత్రుటికాలం నెమలయ్య కళ్ళవైపు పోతుంది. వాళ్ళిద్దరూ రెండుక్షణాలు కళ్ళలోనే మాట్లాడుకుంటారు. గౌరి సిగ్గుతో తలవంచుకుని ముసిముసి నవ్వుతో లోనికిపోతుంది.)

నెమ:—(తింటూ) గురవయ్యా, నేలనిమన్నా, మీ దను పూరి అయినా ఈయింటిలోవున్న చల్లదనం రాజుగారి కోటలోకూడా నేదుసుమా! ఇల్లు, ఇంతనిర్భలం వుంచుతాది నీకుమూ త్రేనా ?

గుర:—మ రే! తల్లిసావుపిల్ల, అంచేత శాకిరీఅంతా దానినెత్తినే, నెమలయ్యా,

నెమ:—పిల్లకి పెల్లి, ఇబాహంప్రయత్నం ఏమన్నా-?

గుర:—రేయి, పవలూ, అదేఆలోచన పడింది నాకు ! నెమలయ్యా ఎక్కడా సమ్మందంకానరాదు!

నెమ:—ఒకయేళ గొప్పింటివోడు యిమ్మంటే పిల్ల నిస్తావా ?

గుర:—గొప్పింటివోడు నాపిల్ల నెందుకడగొస్తాడు, నాయనా ?

నెమ:—ఎందుకో చెప్పనా!- నీముంగ టనవాలిసిన మాటకాదు - పిల్ల సక్కనిసుక్క గనుక ! ఒకవేళ అడుగు తాడనుకో ఇస్తావా ?- రాజుగోరితమ్ముడు, బూటకరావు బహద్దరుగోరు అడగొస్సినారనుకో, ఇస్తావా ?

గుర:—పైకి అనవాలిసినమాట కాదు, నువ్వాడిగావు గనక చెపుతున్నా. అతగాడు బలేపోకిరీ! ఈసంగతిమాత్రం ఆయనతో సెప్పి నాకొంపమాత్రం తియ్యకు,

నెమ:—ఛీ, ఛీ! నానలాటోణ్ణి కాను, నీకాబయుం ఎంతమాత్రం అక్కరలేదు. నేనియేళ నీమనస్సు తెలుసుకోని నామనస్సు నీకు తెలియచెబుదామని మీయింటికొచ్చాను - పోనీ, మంత్రిగోరు అడగొస్తేనో ?

గుర:—మంత్రిగోరు !- 60 ఏళ్ళ ముసలాడు !- అయిదుగురు భార్యలు - అంతకంటె గారిని సముదరంలో తోసేస్తేనో !- నెమలయ్యా, నువ్వునాతో ఆస్యం ఆడుతున్నావు!

నెమ:—ఆస్యంకాదు. పోనీ, రాజుగోరైతేనో ?

గుర:—రాజుగోరా ?- ఏటినీమాటలు నెమలయ్యా, నాకు ఆదీ అంతూ తెలీకుండావుంది !

నెమ:—అడిగినదానికి జవాబుచెప్పు, రాజుగోరికిస్తావా, నీపిల్లని ?

గుర:—రాజుగోరు, మంత్రిగారూ ఒకటేరకంవోయిసు చూడబోతే! తరువాత - రాజుగోరికి రాణులు పదిమంది ! రహస్యంగా ఇంకెంతమందో తెలీదు !

నెమ:—బాగాచెప్పావు !

గుర:—అయితే, నెమలయ్యా, ఇన్నిపశ్న లేస్తున్నావు!- ముగ్గురునెత్తి పెట్టావు, ఈముగ్గురిలో ఎవరికావాల, మాగారి ?

నెమ:—ముగ్గురికీన్ని ! (నవ్వుతాడు)

గుర:—(ఆశ్చర్యంగా) ముగ్గురూ ఎలాగు పెళ్ళిసేసుకుంటారు ? నీకు పిచ్చెత్తిందా, నెమలయ్యా !

నెమ:—ఇప్పుడు, నాకు పిచ్చియెత్తినట్టేవుంది-యిను, సెపుతా, మరి. ఇయేళరాత్రి నీకూతుర్ని, ఈముగ్గురూ, ఒకరికి తెలియకుండా ఒకరు, బలవొంతంగా తీసుకుపోదా మనుకుంటున్నారు. ఆసంగతి నీతోచెప్పడానికే నానొచ్చాను !

గుర:—ఆఁ ! ఆఁ ! తీసుకుపోతారా ? తీసుకుపోయి పెళ్ళాడుతారా ?

నేమ:—ఆమాట నానెలాగు చెప్పగలను ?- కాని ఒక్కసంగతి నువ్వాలోచించు. పెళ్ళాడేబుద్దేశం అయితే రాత్రి ఎందుకొస్తారు ?

గుర:—జౌనౌను. వాళ్ళఉద్దేశం నాకు తెలిచిందిలే. రావణాసుడి ఉద్దేశం ? నాబొందిలో జీవంవుండగా నాకూతు రికి అలాంటిఆపద రానీను. పాణాన్నైకైనా తెగించేస్తాను. రాజైతేం, రెడ్డయితేం - సవారిదండె వొంచినట్టు వొంచిపారే స్తానన్నమాట - (రోషంగాలేచి నిలబడుతాడు)

నేమ:—శాంతం. షాంతించూ, మరి - అంతమట్టుకు రానక్కరలే. నానుకూడా సాయంత్రిం రాజుగారితో ఆ ముక్కకే వచ్చిఉంటా. రాజుగారి హుకుంఅంటూ మీామీాద చాటీ చెలాయిస్తాను - మీారుమాత్రిం నానుసెప్పినట్టా నడు చుకోండి - అప్పుడు నీకుగాని, గౌరికిగాని ఎట్టిఅపాయం వుండదు, తెలిచిందా ? నీకూతుర్నికూడా ఇలాగ పిలువు - కూడబలుక్కోకపోతే సమయానికి బెంబేరెత్తిపోతుంది.

గుర:—అమ్మా, ఇనాగురా.

(ప్రివేశము - గౌరి)

నేమ:—నన్ను మీారిద్దరూ నమ్ముతారా ?

గుర:—నమ్మకేం ?

గౌరి:—కపటంలేకుండావున్న నిన్నునమ్మం ?

నేమ:—సరే, అయితే చాయంత్రిం నాను రాజుగారి పక్షాన్ని వచ్చి మిమ్మల్ని ఆగ్యాపిస్తూంటాను. రాజుగారి ఉత్తర్వుగా నానేంసెయ్యమంటే అదల్లా మీారుసెయ్యాల ! అప్పుడేం ప్రిమాదండుండదు. గౌరిపాణానికి, నాపాణంఅడ్డు. తెలిసిందా, గురవయ్యా! నాకు ఏలవుతూంది-ఏం, సన్నుతేనా?

గుర, గౌరి:—సమ్మతే.

(నెమలయ్య గౌరివైపుచూచి నిష్క్రమణ)

గుర:—నెమలయ్య, మామంచోడు. ఇన్నికబుర్లు సెపు తాడు. తాను పెళ్ళాడెస్తానంటే ఎంతబాగున్ను !

గౌరి:—(నిట్టూర్పువుచ్చి, గోళ్లుగిటుకుంటూ లోనికి పోతుంది)

గుర:—(పోతూన్న గౌరివైపుచూచి) ~~ఈడూ~~ జోడూ సక్కా సరిపోతాది! (రెండవవైపు నిష్క్రా)

[తెర]

# గౌరికోసం

## [ఏకాంకిక]

౧

[స్థలం:—మాలచెరువుగట్టు సమీపాన్ని అందరూ చెరువుకి పోయే మార్గంలో ఒకచిన్న చింతతోపు - ఒకప్రక్కని ఒక పాడు మట్టిగోడ కనిపిస్తూంటుంది.

సమయము:—సాయంకాలము, సూర్యాస్తమయ వేళ - పశ్చిమాన్ని సంజకెంజాయలు -]

(ప్రవేశం రాజావారు, నెమలయ్య సామాన్యదుస్తులు వేసుకుని)

రాజు:—ఆచిన్నది ఈలాగేవస్తుంది కాదూ ?- నీకు బాగా తెలుసా ?- నువ్వెళ్ళి ఆదూరంగా పోతూంన్న మన గుర్రాల్ని - అదిగో, ఆరెండుచెట్లకీ కట్టేశేరా, అప్పుడే మేసు కుంటూ ఎంతదూరం వెళ్ళిపోయాయో, చూశావూ !

నెమ:—చిత్తం. నేను గుర్రాల్ని కట్టివచ్చేలోపల ఏలినవారిక్కడనే వుండండి - ఈగోడవారని.

(నెమలయ్య నిష్క్రమించును.)

రాజు:—ఇలాంటిప్రదేశాల్లో ముళ్ళు చాలా వుంటాయి - పురుగూ పుట్రాకూడా వుండొచ్చు. (గోడమీద వేళ్లాడివున్న చేంతాడుచూచి బెదురుతాడు.)

(నెమలయ్య తిరిగిప్రవేశం)

రాజు:—అప్పుడే గుర్రాల్నికట్టేసి వచ్చావు, నెమలయ్యా ?

నెమ:—లేదు, దేవా !

రాజు:—ఏమీ ?

నెమ:—నేనక్కడికి వెళ్లేసరికి, ఆచెట్లకి ఇదివరకే రెండుగుర్రాలు కట్టబడివున్నాయి ! మరిచెట్లులేవు ప్రాభోషమీపంలో.

రాజు:—నిజంగాను ?- మనకంటె ఎవ్వరోయిద్దరు ముందొచ్చారన్నమాట ! ఆపెద్దమనుష్యు లెవరు - ఎందుకొచ్చివుంటారు ?- ఆఁ - నెమలయ్యా.

నెమ:—(బుర్రగోక్కుంటూ) సిత్తం - మనంయెందుకు వొచ్చామో -

రాజు:—(వెర్రినవ్వుతో) ఔనౌను - పోనీ మన గుర్రాలనీ, ఆచెట్లకే కట్టేలేకపోయావు, నెమలీ ?

నెమ:—కొంపపోదూ ?

రాజు:—ఏమీ ?

నెమ:—మనవి ఆడగుర్రాలూ, ఆరెండూ మొగవీన్ని!

రాజు:—ఆఁ! అహాహా ! ఔను గుర్రాలకీ ఆదేబాధ!

నెమ:—కాని గుర్రాలని ఎడంగాకట్టేస్తే, అవి గడ్డిమేసి వూరుకుంటాయి - మనకీ, అనగా మనుసులికి - ఏకట్టు

బాటూ లేను. అంతేభేదం - నాకొక్కసందేహం కలుగు తూంది, దేవా !

రాజు:—ఏమిటా ధర్మసందేహం ?

నెమ:—ధర్మసందేహం కాదు - అధర్మసందేహమేను, మహాప్రభో !

రాజు:—ఏమిటది ?

నెమ:—మనిషియొక్క గొప్పతనం - జంతువులకంటె, ఎందులోనా, అని !

రాజు:—తెలియదూ, నీకు ?- నవ్వడంలో !

నెమ:—అంతకంటె అబద్ధంఆడడంలో నంటే మరీ బాగావుంటాది - ఏలినవారు కొంచెం వొంగోండి, బుర్ర పైకికానొస్తుంగి, నేకపోతే !

రాజు:—ఏమవస్థ వచ్చిందీ ! నెమలయ్యా, మనకెందుకూ, ఈబాధంతాను, నువ్వుచెప్పు, చూద్దాం !

నెమ:—అదేమో, నాకేం తెలుసును మాప్రభో ?

రాజు:—గారిని చూడ్డానికి - చూచి ఆనందించడానికి !

నెమ:—అంతేమరి !- నానూ అలాగేఅనుకున్నా ! ఎవరో యిటువస్తూన్నసడి అవుతూంది - ఏలినవారు బుర్ర బాగా వంచుకోండిమీ !- మీదికెత్తికండి.

(రాజు బాగాబుర్రవంచి గోడవారనక్కుతాడు)

రాజు:—(దృష్టిసారించి) ఎవరో ఆడమనిషి వస్తూన్నట్టుంది - అదిగో తలమీద బిందె ?

(ఒకదాసరి, ముసుగూ, తులసిపూసలూ, నెత్తినిఅక్షయపాత్రతో ఒకవైపునుంచి ప్రవేశించి, రెండవవైపు పోతూంటాడు.)

నెమ:—(నవ్వు ఆపుకుని) ఏలినవారికి ప్రపంచమంతా ఆడస్త్రీమయంగా వుంది - మొగోడు, దేవా!- దాసరి - పొరుగూరికిపోయి, బియ్యందండుకొని, తిరిగి పట్నం చేరుకుంటు న్నాడు, అంతే! (దూరంగాచూపించి) అదిగో, ఈసారి నిజ ద్దిగా ఒకపిల్ల కడవ చంకెట్టుకొని అతివొయ్యారంగా ఇటు వస్తూంది. (వయ్యారంగా తప్పుకుంటాడు) (బాగా పరికించి) ఆపిల్లే!- ఈసారి నిజంగా గౌరే!

(గౌరి ఒకవైపునుంచి, ఇంకొకవైపుకు వయ్యారంగా నడిచిపోతుంది. లేతసూర్యకాంతి గౌరిమీదపడి ఒకవింతశోభ యిస్తుంది. రాజు, గౌరినిచూడబోయి, తలయెత్తడానికి ప్రయ త్నిస్తాడు. నెమలయ్య, రాజుగారితల క్రిందికినొక్కేసి, "ప ల్లోరు క్షమించాలి" - అంటాడు)

(రాజు నోరుతెరిచి, గౌరిని రెప్పవాల్చకుండా చూస్తూ వుంటాడు. అరనిముషానికి ఒక్కసారి, 'ఏమివయ్యారం!- ఎంత చక్కనిపిల్ల! అంటూ నోరప్పళిస్తూ' ఉంటాడు.)

రాజు:—నెమలయ్యా!- అబ్బ!-

నెమ:—ఏమి, మహాప్రభూ!- దాహమౌతూందా మేటి, నోరలాగున సప్పరిస్తున్నారు?- ఆగౌరి నిన్ని నీళ్లు తెచ్చి పొయ్యమననా ఏల్నివోరినోట్లో?

రాజు:—కొంపతీస్తావేమిటి?- నెమలయ్యా, ఈ దాహం నీళ్ళతోతీరేది కాదోయి! ఉస్!- వేడి!- తాపం-!

నెమ:—కాలం గడిసిపోతూంటే, పసందంగా మండు తూన్న అగ్గికూడా సల్లారి బూడిదా బస్మమైపోతుంది - ఈ దాగం - ఈతాపం ఏపాటివి, మహాప్రెబో?

రాజు:—(విసుగుదలతో) నాబాధ నీకు బోధపడ లేదు, నెమలయ్యా !- నేను నీకు ఏలాగు బోధపరుస్తాను ?

(దీనత్వంగా చూస్తాడు)

నెమ:—మీబుర్ర -

రాజు:—(తెల్లబోయి) - ఏమన్నావూ ?

నెమ:—మీబుర్ర పైకికనిపిస్తూంది. ఎవ్వరో పురుసులు ఇటువస్తూన్నట్టుంది - అళ్ళనిచూచైనా మీతాపం చల్లారుతాదేమో ?- వొంచండిదేవా మీకాళ్ళు - బుర్ర బాగా వొంచుకోండి, సామీ !

రాజు:—(భయంచేత బుర్రవంచుకొని) ఎంత అందమైన పిల్లా !

నెమ:—అవును, నిజమే !- ఏలినవారు మనస్సులోనే అనుకోండి కాని, పైకేటిఅనకండి !

రాజు:—మాజనానాలో ఏస్త్రీకూడా చక్కదనంలో, ఈపిల్ల - ఈగౌరి - కాలిగోరుకి పోలివుంటాదనుకోను !

నెమ:—అదేటో మీ కే తెలియాల, దేవా !

రాజు:—మామహలులో - పదిపంజరాలున్నాయి. ఒక్కొక్క పంజరంలో, ఒక్కొక్కరకం చిలకుంది. ఈ గౌరి చిలకనికూడా ఒకపంజరంలో ఉంచేస్తే-!

నెమ:—ఔను, పాపం ?- సాలా సౌఖ్యపడుతుం దన్నమాట, నిజంగా !

రాజు:—చూశావూ, నెమలయ్యా! ఈ గౌరి అందానికి అనువుగా, దుస్తులు వేసేస్తే, దాన్ని చూడ్డానికి రెండు కళ్లు చాలవు!

నెమ:—(తనలో) సులోచనా లేసుకుంటే నాలుగు కళ్లు అవుతాయి!

రాజు:—ఏరాణీ పనికొస్తుంది, చక్కదనంలో?

నెమ:—(తనలో)ఈమాటలురానీగోర్లెవరైనాయింటే, తెలిసొస్తాది. (పైకి)ఏలినవారు ఒక్కసంగతి మరిసిపోతున్నారు!

రాజు:—ఏమిటది ?

నెమ:—అది — బోయ గురవయ్య కొమార్తె — దాన్ని—రానినెలాగు చేస్తారు, దేవా ?

రాజు:—'అది' — 'దాన్ని' — అంటావా ? — 'ఆ అమ్మాయి' అనలేవా ?—ఔను, బోయగురవడి కూతురై తేమాత్రం ? — అది అలావుణ్డీగాని, నెమలయ్యా' నువ్వు—ఇప్పుడాపిల్లని చూశావుకదా—ఒక్కసంగతి చెప్పు —జుత్తు—బెరుకుగా చుట్టకుదురులాగుందా ?

నెమ:—ఏదరిద్దురుడన్నాడు, సుట్టకుదురని ? ఎంత సక్కనిజుత్తూ, నున్నగా పట్టుకుచ్చునాగుంటేనూ ?—

రాజు:—ఆ ముసలిమంత్రి—వాడి నేత్రాలు రెండూ తగులడా ! — ఇక్కడవున్నాడుకాడు, తగినట్టు బుద్ధిచెప్పి వుందును ! ఉదయం, అన్నాడు—జుత్తుబాగులేదని !

నెమ:—మంత్రిగార్ని, తీసుకురానా, బుద్ధిచెబుదురు గాని, ఏలినవారు ?

రాజు:—మంత్రి యిక్కడ వుంటేనా ?

నెమ:—ఈ ప్రాంతాన్నే వున్నారు, మంత్రిగారు,

రాజు:—(తెల్లబోయి) నిజంగా ?- ఎందుకొచ్చాడూ, ఇక్కడికి ?

నెమ:—ఏలినవారిని కనిబెట్టి యేగుసూడ్డానికికావాల!

రాజు:—అంతేనా, లేక ఆముసలి పీనుగుకూడా గౌరి మీద కన్నేశాడా? (గుడ్లెర్రజేస్తాడు).

నెమ:—(దూరంగా చూపిస్తూ) అదిగో - ఆమామిడి చెట్టు - ఏలోన్నరు, సిత్తగించారూ? దానియెనకని ముసుగేసుకుని, దాగున్న ఆయిగ్రిహం - ఆయనే ఏల్నివోరి పెదార మంత్రిగోరు!

రాజు:—(చూచి, నివ్వెరపడి) అయితే, నెమలీ! మంత్రి, నన్ను చూసేవుంటాడని నీ అభిప్రాయమా?

నెమ:—పిలవమని సెలవా, మంత్రిగోర్ని?

రాజు:—అబ్బే, అక్కర్లేదు.

నెమ:—మంత్రికి బుద్ధిసెబుతామన్నారుగా?

రాజు:— పోనిస్తూ - ముసలాడితో మనకెందుకు? దీనుడు - దీనులపట్ల కనికరం కలుగజేసికోనివాడు, ఏటిరాజు?

నెమ:—నిజమే, ఏటిరాజు! ఏల్నివారు నిజంగా దయకి సముద్రమంతోళ్ళు - (తనలో) ఐతేం, ఉప్పునీళ్లు! - సేదు. ఇసం!

రాజు:—ఏమిటాలోచిస్తున్నావు, నెమలయ్యా! గౌరి. ఇంకా నీళ్లుముంచుకొని రాలేదేమి?

నెమ:—(వినిపించుకోనక, దూరంగా చూస్తూ) ఏల్ని వారు చమిస్తే - దూరాన్ని ఒక్క మంత్రిగారేకాదు - బగవొంతుడు చాలా మేలుచేస్తే - మరొక్కరుకూడా వున్నారు, ఏల్నివారికి తెలిసినోళ్లు!

రాజు:—(కంగారుగా) మరెవ్వరున్నారు?

నెమ:—ఏల్నివారి సోధరులు-శ్రీ శ్రీ భూటకరావు భాద్దూరువారు !

రాజు:—(తుళ్ళిపడి) ఏమిటే, నిజంగానూ ?

నెమ:—(దూరంచూస్తూ) సిత్తం, వారు ఇటేవొస్తూన్నారు కూడాను !

రాజు:—(ఆతురతగా నెమలయ్య చెయ్యిపట్టుకొని) ఏమిటిసాధనం ?

నెమ:—మీ కెందుకింతబయుం? - తమరేం పాపకార్యాం సెయ్యడానికి వొస్తేగా !

రాజు:—ఔనౌను. (గోడవెనక బాగావంగి కూర్చుంటాడు).

(ప్రవేశము, బూటకరావు-ఒకఅనుచరునితో మాట్లాడుతూ బూటకరావు చేతిలో పిస్తోలుంటుంది).

బూట:—ఔను. నువ్వుచెప్పినది నిజమే ! నేనూ చూచాను - ఆ మామిడిచెట్టువెనక - ఒక ముసలాడు - నువ్వుచెప్పినట్టు వాడు - ప్రధానమంత్రిలాగే ఉన్నాడు. మొరడువారిన మొద్దులుకూడా చిగిరిస్తున్నాయన్నట్టుగా - ఈ ముసలి పీనుగుకికూడా - ఈపిల్లని చూశాక - చల్లారిన కామాగ్ని మెల్లగా రగులుకుంటూన్నట్టుంది !

(ఆ మాటలువిని రాజు సిగ్గుపడుతాడు - నెమలయ్య రాజుగారి ముఖంచూచి నవ్వుతాడు - రాజు నెమలయ్యనుద్దేశించి నోరుచెయ్యవద్దన్నట్టుగా సౌంజ్ఞచేస్తూ, దీనత్వంగా ముఖం పెడుతాడు).

అను:—ఒక్క మంత్రిగారే, కాదు - ఇందాకాదూరం నుంచి చూచినప్పుడు, ఈప్రాంతాన్నే, రాజుగారినికూడా చూచిన అనుమానంగా వుంది!

(ఇదివిని రాజు బోర్లా పడుక్కుంటాడు, ఊపిరిబిగబట్టి).

బూట:—ఎవరూ? (కొంచెము బెదిరి, వెంటనే సర్దుకొని) మా అన్నగార్నా? - నిజంగానే? - అయినాపర్వా లేదు. ఏమంటావా, అతగాడికి రేచీకటి - రాత్రి దగ్గరవస్తు వులే - తన్నేస్తుంటాడు. నన్ను ఆనవాలుపట్టేదేమిటి?

అను:—ఇదిగో, ఆపిల్ల వస్తూంది, నీళ్లెత్తుకుని - (బూటకరావు ఆవైపుచూస్తాడు రాజు బుర్రఎత్తడానికి ప్రయత్నిస్తాడు. నెమలయ్య రాజుగారితల, క్రిందికి గట్టిగా అదిమి పట్టుకుంటాడు, బూటకరావు గారికి దారి విడుద్దామని, అను చరునితో గోడవైపుకే సర్దుకుంటాడు)

(ప్రవేశము-గౌరి నీళ్ళబిందెతో - ఒకవైపునుంచివచ్చి రెండవవైపు "గంగవైతే నువ్వు-గగనముందుండాక-" పాట పాడుకుంటూ నిష్క్రమించి.)

బూట:—నిజంగా అందానికి రంభవలె నుంటుంది. ఔనా? - రాత్రి ఎనిమిది గంటలకి మనపని పూర్తికావాలి, తెలిసిందా? (ఇద్దరూ నిష్క్రమించి).

(రాజు కష్టంమీదలేచి బాగా ఊపిరితీస్తాడు. నెమలయ్య రాజుగారివళ్ళు దులుపుతాడు).

నెమ:—(బిగ్గరగా) చూశారా ప్రభో-చిన్నమహా ప్రభోగారన్నమాట యిన్నారా? గౌరి, రంభలాగుందిట! రంభని రోజూ సూస్తూన్నట్టుగా మహా!

రాజు:—నోరు చెయ్యకురా, నీపుణ్యాం వుంటుంది. విని యుద్ధానికి రాగలడు, వీడూ పిస్తోలూను !

నెమ:—బయంనేదు. అప్పుడే గుర్రాలెక్కి సాలా దూరం ఎల్లిపోయారు-తమరు యిన్నారో, లేదో-ఎనిమిదో గంటకె సరిగా-సిలకని-పట్టేస్తామన్నారు !

రాజు:—ఔను. విన్నాను. ఇప్పుడేమిటి, ఉపాయం ?

నెమ:—సాలా సులబమైనఉపాయం ! - ఏటంటే - అంతకు ముందుగానే-అనగా యిప్పుడే మనం - ఆ గురవడ్నీ, ఆ గాదినీ-మరొకయింటికి పంపివేయడం-ఆళ్ళయింటికి తాళం వేయించడం !-ఇది ఎల్నివోరి ఆజ్ఞగా బందోబస్తు చేసేస్తేసరి!- పిలక మన ఆధీనం అవుతుంది !

రాజు:—బాగుంది ఉపాయం - అప్పుడు మావాడు వాళ్ళింటిచుట్టూ మూడుప్రదక్షిణాలుచేసి, తెల్లబోయి, వెళ్ళి పోతాడు-ఏమిచక్కనిఉపాయం, నీది-నెమలయ్యా !- నువ్వు తక్కువవాడివికావు - నీకు ప్రొమోషన్ ఇస్తున్నాను ఈనెల నుంచీ !-

నెమ:—సిత్తం, సిత్తం-ఆ ఏర్పాటు కోసాకీ, నడిపించ మని సెలవా ?

రాజు:—సందేహమేమిటి ? నేనిక్కడే వుంటాను. నువ్వెళ్ళి, ఇప్పుడు మనమనుకున్న యేర్పాటు చేసిరా !- త్వరగా - చేసుకురావాలి !- తెలిసిందా ? - నువ్వులేకపోతే నాకు చెయ్యి విరిగినట్టుంటుంది.

నెమ:—మినిట్లమీదొస్తాగా ?

(నెమలయ్య నిష్క్రమిస్తూంటే తెర).

# గౌరి కోసం

## [ఏకాంకిక]



౧

[స్థలం : గురవయ్య యింటిముందు]

[సమయం : 7-15 P. M.]

(తొందరగా ప్రవేశం : నెమలయ్య, గురవయ్య, గౌరి)

నెమ:— ఊఁ, వేగంగా తెమలండస్సి! రాజుగారి ఆజ్ఞ! - మీకు ఒక్క అయిదునిముసాలే టైము! - ఈ అయిదునిముసాల్లో మీరు ముఖ్యమైన లొద్దూలొసుగూ పోగుచేసుకుని, మీయింటికి తాలంవేసేసి మాయింటికి పయనం కావాలి - తోవలో రాజుగోరుకూడా కలుస్తారు - ప్రస్తుతం, మీరు మాయింటికి పయానం అవుతూన్నట్టు శ్రీవారికి తెలియబర్చ నక్కరలేదు - ఊఁ తెమలండి, జంకి వోడక! - రాజాజ్ఞ!

(గౌరి తొందరగా లోనికిపోతుంది. ప్రయాణం అంటే అతి ఉత్సాహంగా వుంటుంది.)

గుర:—సంపేశావు నెమలయ్యా, ఇంత, హటాత్తుగా-

నెమ:—ఇంకా ఇక్కడే వున్నావూ? - వేగం - నీకంటె గౌరి నయం!

గుర:—ఒకచనంలోకొస్తా - (నిష్క).

నెమ:—(తనలో) రాజు, - మంత్రి, - వోదాలంటే వున్నాయికాని, ఓటికుండలతో సమానమైన బుర్రలు. ఇలాంటి బుర్రిల కళ్ళల్లో దుమ్ముకొట్టడం చాలా సులభం! (నవ్వుకుంటాడు).

గౌరి:—(చేతులో ఒకచిన్నమూటతో ప్రవేశించి) ఇదిగో, నేను సిద్ధంగా వున్నాను!

నెమ:—చబాష్, చురుకుదనం అంటే అలాగు ఉండాల! - నువ్వూ నేనూ సిద్ధంగావుంటే సరా, మరి? మీతండ్రికూడా సిద్ధంగా వుండొద్దూ (రెప్పలల్లార్చి గౌరిని చూస్తాడు).

గౌరి:—ఔను: మానాయనకూడా ఒక్క నిము సంలో సిద్ధంగానే వుంటాడు - (సిగ్గుపడుతుంది) - అదిగో, నాయనకూడా వచ్చేశాడు.

(ప్రవేశము: గురవయ్య, కుడిచేత ఒకమూట, ఎడమ చేత ఒక కప్పతాళం, తాళాల గుత్తితో).

నెమ:—ఇదిగో నాను సిద్ధంగానే వున్నాను.

(యింటిపైకి గొళ్లెంపెట్టి, తాళంవేస్తాడు. ముగ్గురూ నడుస్తూంటారు).

[దృశ్యాంతరం తోవలో]

(నెమలయ్య ముందు, మధ్యగౌరి, వెనక గురవయ్య నడుస్తూంటాను - రాజుగారు ఎదురుగావచ్చి, పరకాయించి చూచి)

రాజు:— నెమలయ్యా, నువ్వేనా? - వీళ్ళని, ఎక్కడికి తీసుకుపోతున్నావు, ఇటువైపు?

నెమ:— మరేంనేదు మహాప్రెబో? మావీధిలో ఒకి కాళీయిల్లుంది - అందులో ఈ వుభయుల్నీ ఉంచడం మంచిదనియెంచి - తీసుకొచ్చాను - ఈళ్ళని మాలపేటలోనే వుంచేస్తే లాబంలేదు!

రాజు:—(నెమలయ్యవైపు అనుమానంగా చూస్తాడు)

నెమ:— నామాటినండి, దేవా! ఈళ్ళని ఈళ్ళింటికి ఇరుగునా, పొరుగునా వుంచుతే తమ తమ్ముడు బాద్దూరు గారు, అవలీల ఆచోకీ కట్టేస్తారు - అందుచేత, ఎంతదూరం తీసుకపోతే అంతమంచిదని ఊహించి, మావీధికి తీసుకుపోతున్నాను (రాజుగారితో రహస్యంగా) ఇది తమ ఆజ్ఞ, అని చెప్పాను, అసలే ఈళ్ళిద్దరూ బయంతో వణకిపోతున్నారు, ఇలాంటి సందర్భంలో ఏలోన్నరు అడ్డుతగిల్తే బెంబేరుపడి పాణాలు వొదిలేస్తారు. ముఖ్యంగా ఆ పిల్లకి బయంపోగొట్టి తెమల్చుకొని వచ్చేసరికి నాతలపాణం తోక్కొచ్చింది - ఇంకా బెమురుతూనేవుంది, పాపం! ఇక నడవలేక చదికిలపడి పోయిందంటే మీరో, నేనో, మరెవ్వరో ఎత్తుకుని తీసికెళ్ళ వలసివస్తుంది.

రాజు:— ఔనౌను. పాపం! - చిన్నపిల్ల! - కోమల మైన హృదయం! - (గౌరివైపుతిరిగి) అమ్మాయీ, నీకేం భయంలేదు - గురవయ్యా, నువ్వేం భయపడకు - మిమ్మల్ని ఒకానొక గొప్ప ప్రమాదంనుంచి కాపాడుదామని ఈ రీతిని చెయ్యవలసివచ్చింది.

నెమ:—ఔను. మిమ్మల్ని రచ్చించిడానికే ప్రభువు వారు ఇంత ఇశ్వప్రియత్నం సేసినారు! (కోపం నటిస్తూ -) నడవండి, బొల్లిపద్ధులుమాని!

గౌరి:—(దొంగయేడుపుతో) మాగుడిసెంగో మేముం టే, ఎవరికేం అపరాధం చేశాం?

నెమ:—అపరాధవాఁ? - నువ్వు అంత సక్కగా వుండడమే అపరాధం! - నడువుతిన్నగా! రాజాజ్ఞంటే ఏమి టనుకున్నావో!

రాజు:—నెమలయ్యా, శాంతంగా మాట్లాడలేవూ?

గుర:—ఏలినవారు రచ్చించాలి. మామేం ఎరగం? నానేం అపరాధం సెయ్యనేదు - (భయం నటిస్తాడు).

రాజు:—మొదటే అభయం ఇచ్చాముగా? - భయం లేదు, నడవండి!

(ముందు నెమలయ్య, - మధ్యని గౌరి, గురవయ్య - వెనక, రాజుగారు - గౌరి అందానికి నివ్వెరపడుతూ నడు స్తూంటారు. తెరలో గుర్రం పరుగెత్తినశబ్దం - మరొక్క నిముషానికి రౌతువేషంతో వెనుకనుంచి బూటకరావు ప్రవే శము. చీకటపడింది - కనుక అతను వ్యక్తులను ప్రత్యేకంగా పోల్చడానికి వీలులేదు, ఒక్కగౌరినితప్ప - బూటకరావు రాజును ఎదుర్కొంటాడు).

బూట:—(రాజుతో) ఓరి దగాబాజీ! ఎవ్వరురా నువ్వు? ఈ పిల్లని ఎక్కడికి నడిపించుకుపోతున్నావు? - ఏయ్, నిలబడండి, మీరు, ప్రాణాలమీదఆశవుంటే! (పిస్తోలు చూపుతాడు. అంతా నిలబడిపోతారు. రాజును సమీపించి, దగ్గరగా ముఖంచూచి, రాజుగారనిపోల్చి, నిశ్చేష్టుడై

పోతాడు, కాని వెంటనే సర్దుకుంటాడు. రాజుగారుకూడా, తమ్ముడనిపోల్చి, నిశ్చేష్టుడై, సిగ్గుపడి, కొంతసేపటికి ధైర్యం వహిస్తాడు).

బూట:—ఆ - శ్చ - ర్యం!

రాజు:—అ - వ - మా - నం!

బూ:—ఇంత - వయస్సుంలో!!

రా:—(సిగ్గుపడి, నోరుతెచ్చుకొని) రాజవంశములోని వాడవు!! (బూటకరావు సిగ్గుపడుతాడు).

(ఈ వ్యవహారం అంతాచూచి, నెమలయ్యకి నవ్వు వస్తుంది).

(ఇంతలో - తెరలో - తిరిగి గుర్రం పరుగెత్తినశబ్దం- మరొక క్షణానికి - మంత్రి ఒగర్చుకుంటూ ప్రవేశిస్తాడు).

మంత్రి:—దొంగలిక్కడా వున్నారు? - (ఆతని గారినితప్ప ఎవ్వరినీ స్పష్టంగా పోల్చలేదు) - ఆ పిల్లని, ఎక్కడికి తీసికెళ్తున్నారు - ఎవరుమీరు?

నెమ:—(మంత్రిని గురుతించి, మారుగొంతుకతో) ఎవ్వరునువ్వు? - ఈ అమ్మాయిని పెళ్ళిచేసుకున్న భర్త నాగున్నావే, నీమాటలుబట్టి సూస్తే?

మంత్రి:—నువ్వెవ్వరు, నన్నడగడానికి? - నేనెవరో నీకు తెలిసివుంటే - ఇలాంటి బుర్రతిరుగుమాటలాడవు!

నెమ:—ఈపిల్ల పెనిమిటివా? - అయితే? - ఇక్కడ నీకంటె ఎక్కువైన వాళ్ళిద్దరూ, ఈ పిల్లని రక్షించడానికి తీసుకుపోదామని చూస్తున్నారు - నువ్వు భర్తవైనా, ఆళ్ళకి ఎక్కువలేదు!

మంత్రి:—నేను భర్తనుకాను!

నెమ:—భర్తవు కాబోతావా? ఇబాహమాడి?

మంత్రి:—(తనలో) వివాహం! - ఈ వయసున, (ప్రకాశంగా) బోయపిల్లని - నేను - వివాహం చేసుకుంటానా? (విరసంగా నవ్వును). - వివాహం చేసుకోకపోతే నేం? - ఉంచుకుందికి అభ్యంతరం లేదుగా?

నెమ:—అబ్బో, అదా నీబుద్దేశం? మహాగొప్ప బుద్దేశం! - పెళ్ళిఆడవుకాని, పిల్లమాత్రం నీకు కావాలి! - రామ, రామ! ఆడదిఅంటే అగ్గిపెట్టె అనుకున్నావు! ఇ స్త్రీ జీవితాన్ని, నాలుగుదమ్ములీడిలిచ్చి కొనేదామనుకుంటున్నావు!- ఎవ్వరునాయనా, నువ్వు! (దగ్గరగా వస్తాడు. మంత్రి, నెమలయ్యని గురుతించి, నిర్ఘాంతపోయి, సిగ్గుతో చచ్చిపోయినట్టవుతాడు. నెమలయ్యకూడా, అప్పుడే మంత్రినిపోల్చినట్టు నటించి, నాలుక కరుచుకొని, చేతులు జోడించుకుని). చమించాలి, దేవా! ప్రభువువారి భృత్యుకుణ్ణి! - మీసాకర్ని! - పెదానమంత్రిగారని ఎరక్కపోయాను! తప్పుడుకూతలు కూసినందుకు చమించాలి, దేవా!

మంత్రి:-(తబ్బిబ్బుమాటలతో) నెమలయ్యా!, ఆఁ! నెమలయ్యా, నువ్వెందుకొచ్చావిక్కడికి?

నెమ:—పిత్తం, పిత్తం - నాను నెమలయ్యనే మహాపెభో! - డ్యూటీమీదే వచ్చానిక్కడికి!

మంత్రి:—ఆఁ - డ్యూటీమీద! - అనగా రాజాబహద్దురువారి పంపునా?—

నెమ:—పంపునరా నేను, దేవా! ఎంబడే వచ్చాను!

మంత్రి:—అనగా, రాజావారున్నారన్నమాట ఈ ప్రాంతాన్ని ! - కొంపపోయింది ! (అటూ యిటూ చూస్తూ నిలబడిపోతాడు—రాజు పక్కకి సర్దుకుంటాడు).

బూట:—(తనలో) రసాభాస ! - అంతా రసాభాస!- పరువుపోయినమాట ! - ఎట్టి అపూర్వ సమావేశం ! - రాజు, రాజుతమ్ముడు, ప్రధానమంత్రి - ముసలివాళ్ళకి సిగ్గులేక పోతే నాకు సిగ్గుండొద్దూ ! . రాజ్యంలోకల్లా కొమ్ములు తిరిగినవాళ్ళు క్షుద్రంగా, ఒక ఆడపిల్లకోసం - గాకికోసం - బుద్ధి గడ్డితిని - ఇలా ప్రవర్తించారు అంటే !- ఎంతఅపకీర్తి!- మరొకనిముషం ఇక్కడుంటే, మాలపేట యావత్తూ ఇక్కడ చేరుతుంది - శీఘ్రబుద్ధీ పలాయనం.! (నిష్క్రి).

నెమ:—(మంత్రితో) మీరు నన్ను చమిస్తేకాని, ఇక్కడనుంచి, కదలను మహాప్రభో !

మంత్రి:—నెమలయ్యా, ఇందులో నీపొరబాటేం లేదు. షష్టిపూర్తిఅయిన ముండాకొడుకుని - నేను, కామం చంపుకోలేక - వెర్రివెంగళప్పనైతే, నువ్వేం జేస్తావు ? తగి నట్టు బుద్ధిచెప్పావు - అనరానిమాటలేం నువ్వు అనలేదు ! - అనవలసినమాటలే, అన్నావు ! - నేను - మంత్రినైన నేను - రాజ్యంలో అపచారం జరగకుండా చూడవలసినబాధ్యతగల నేను - ఆడదంటే ఆటవస్తువని అనుకుని - స్త్రీ అంటే చీమ కంటే కనికిష్టమనియెంచి - అక్రమంగా - ఉద్యోగగర్వంచేత- మన్ను, మిన్ను తెలియక ప్రవర్తించాను !

నెమ:—శాంతించండి. నన్ను చమించండి - తెలియక చేసిన అపరాదం !

మంత్రి:—అపరాధంనాది ! - నేనే క్షమాపణ వేడు కోవలసివస్తుంది ! - నేనెవ్వరిని క్షమాపణ వేడుకోవాలో నాకు తెలియకుండావుంది !

నెమ:—అదిగో, వారిని ! (రాజువైపు వేలెట్టి చూపిస్తాడు) వారే ప్రస్తుతం ఈ పిల్లతరఫున గార్డియన్ !!

(మంత్రి రాజును సమీపిస్తాడు. రాజు మొదట సిగ్గు పడి, వెంటనే ధీమాఅయిపోతాడు - మంత్రి, రాజుగారిని గురుతించిన సమయానికి)

నెమ:—మ్హహాశైబో ! ఏల్నివారితో సంబాసించడానికి ముక్య మంత్రిగోరు నిరీచ్చిస్తున్నారు ! (తనలో) ఇక్కడికొచ్చినా ఈ దర్వానుపని తప్పిందికాదు, నాకు !

మంత్రి:—(సందేహిస్తూ) చిత్తం, చిత్తం ! - తమతో చెప్పకుండా వచ్చేసినందుకు ఏల్నివారు క్షమించాలి ! శ్రీవారి తమ్ముడుగారైన బూటకరావు బహద్దరువారిని అపకీర్తిపాలు కాకుండా ఆటంక పెడుదామని ; - ఏల్నివారుకూడా - ఆవుద్దేశంతోనే - వచ్చినట్టుంది !!

రాజు:—మన యిద్దరివుద్దేశాలూ, కలిసి ఒక్కటే ఉద్దేశం, లెండి ! - దానికేం ? - ఏదో ముసలికాలపు చాపల్యం ! - ప్రధానమంత్రిగారైన మీయొక్కసలహా తీసుకోకుండా - ఈవిధంగా - ఇక్కడికి వచ్చినందుకు - మీరు మరోవిధంగా, భావించకండేం ?- వేళ లేకపోయింది, దేనికీన్ని !

మంత్రి:—(సిగ్గూ, సంతోషం, ఒకదానివెనుక ఒకటి అభినయిస్తూ) చిత్తం! చిత్తం! దయచేయండి, కోటకిపోదాం!- ఇక్కడ మంచు పడుతూంది !

రాజు:— పోదాం, లెండి! మీ సలహాకి అడ్డు వుంటుందా? - అయితే, మంత్రిపుంగవా? (గౌరినిచూపించి) ఈచిన్నది కొంచెం దిబ్బగావుందికాదూ? - జుత్తు, చుట్ట కుదురులాగూ - చాయ, పాలబల్లి చాయలాగూ, ఉన్నాయి కావూ?

మంత్రి:—చచ్చినపామునెందుకు కొడతారు, ప్రభూ! సిగ్గుచేత సగం చచ్చివున్నాను - మీమాటలు నాహృదయంలో - శూలాలవలె నాటుకుంటున్నాయి.

(ఇద్దరూ నడుస్తూండగా)

నెమ:—ఈపిల్ల మాటేమిటి, మహాపెబో? ఏం జెయ్యమని, శెలవు?

రాజు:—(ఆగి) ఔనౌను - మరచాను - ఈ పిల్ల - (నవ్వి) చాలా ప్రమాదకరమైనపిల్ల! - బ్రహ్మచారివి, యువకుడివి, ప్రజ్ఞావంతుడివి, ఏంజేసుకుంటావో, మాకేంగావాలి? నెమలీ! నువ్వు - ఈగౌరిని - వివాహం చేసుకోడం, నాకు సమ్మతం! అన్నివిధాలా, నువ్వుగౌరికి, గౌరి నీకూ తగివున్నారు!

మంత్రి:—ఔను - చాలాబాగావుంది, ఈడూ జోడూ! చిలక, గోరింకలాగుంటారు! ఇలాంటి దాంపత్యం చూడ్డానికి ముచ్చటేస్తుంది, నిజంగా!

నెమ:—(సంతోషం, సిగ్గు అభినయిస్తూ) సిత్తం, సిత్తం! - ఏం గురవయ్యా, రాజుగారిఆజ్ఞ! - ఏమంటావు?

గుర:—నువ్వు మాగౌరిని పెళ్ళాడ్డం నాకు మొదట్నుంచీ యిష్టమే!

నెమ:—ఏం, పిల్లా! రాజుగారిఆజ్ఞ! - ఏమంటావు?

గౌరి:—రాజుగారు, ఆజ్ఞాపించడం, మంత్రిగారు ఆమోదించడం, మాతండ్రి ఇష్టపడడం - నానేమంటాను? - సరే, అంటాను!—

(రాజు, మంత్రి) - గౌరిచేతిని, నెమలయ్య చేతనుంచుతారు. గురవయ్య, మీదికినూంచి నమస్కరిస్తాడు. గౌరీ, నెమలయ్యా, రాజుగారియెదుట మోకాళ్లపడుతారు. రాజు, మంత్రి వారిని ఆశీర్వదిస్తారు.)

నెమ:— (గౌరితో కొంచెముందుకివచ్చి) తుదకీ తుపానుగాలి నన్నేకొట్టుకొంది!

[తెర].



# రేడియో సంక్రాంతి.

౧

పోతరాజుగారి కుటుంబం చూస్తే, కాపులలో మూడు తరాలనాటి నాగరికత గోచర మౌతుంది. ముసలిదానయ్య కౌపీనం విడిచిపెట్టినట్టి సహస్రమాసజీవి; అతనికుమారుడు అసిరయ్య కౌపీనం విసర్జించి ముతుకరకం వడుకునూలుపంచ మోకాళ్లు దిగకుండా కట్టుకోవడం ప్రారంభించి పదిసంవత్సరాలు కావచ్చింది! ఇతడివయస్సు సుమారు ఏభై. మనకథానాయకుడు ఇతనికుమారుడే: పేరు సాధారణంగా 'పోతరాజు'; యింట్లో తండ్రికీ, తాతగారికీ 'పోతయ్య', 'పోతన్న'. పోతరాజు పెద్దింటి రైతుబిడ్డ. తండ్రికి ప్రథమసంతానం; వయసు పాతికవత్సరాలు — నవయౌవనంలో ఉన్నాడు— దినభాగంలో సూర్యోదయంలాగూ, అబ్దచక్రగతిలో వసంతాగమంలాగూను. పోతరాజు అసలు నాజూకైనమనిషి. స్వయంగా తానో, భార్య అంకమ్మో వడికిన సన్ననినూలు వెడల్పుపంచా, అదే నూలులాల్చీ తొడుక్కుంటాడు బాగా తెలుగూ, కొద్దిగా హిందీ నేర్చుకొని గ్రామంలోని తోడి యువకులకందరికీ ఆదర్శప్రాయుడే కాకుండా నాయకుడు కూడాన్నూ. పోతరాజుసలహాలేనిదీ ఏముఖ్యమైనపనీ ఆగ్రామంలో జరగదు. అతడుచెప్పిందేమాట. సౌజన్యమైనస్వభావం, దానికి తగిన తెలివితేటలు, విద్యాబుద్ధులు అతనికి పెట్టని

అలంకారాలు. మోటార్లు రావడంవల్ల పూర్వంకంటె పదిరెట్లు దగ్గరైన పట్నపువాసనకూడా ఉండడంచేత అతడికి టాకీ ప్రదర్శనాలు, రేడియో మొదలైనట్టి విద్య, విజ్ఞాన, వినోదదాయకము లైన ముఖ్యవిషయాల్లోకూడా పరిచయం వుంది. రేడియోలో రైతుల వ్యాసంగాన్ని పట్నంలో విని తనకాపుజాతి ఎంతమట్టుకు వెనకపడివున్నదో అని దిగులుపడి, తనజాతిని ముందుకి తెచ్చే మార్గాలు ఆలోచించే సద్బుద్ధికలిగినవాడు. నాడు 'మాలపిల్ల' టాకీ ప్రదర్శనంలోని శంపాలత అమాయకత్వము, నిష్కాపట్యము చూచి హృదయం ద్రవించి,కన్నీరు కార్చిన కోమలస్వభావుడు. అంతేకాక ప్రాపంచిక నాగరికతా హర్మ్యానికి వ్యవసాయదారుడైన కాపే పునాది అని గుర్తెరిగిన స్వకులాభిమాని. వీటన్నిటికీ పైమాట హాస్యరసప్రధానమైన స్వభావంలో జనరంజకుడైన రసజ్ఞుడుకూడను.

౨

గ్రామంలో గొప్పసభ. ప్రధానమంత్రిగారి రాక, పతాకోత్సవం, రేడియో ప్రతిష్ఠాపన, రేడియోశ్రవణం, ఊరేగింపుటుత్సవం—ఇదీ నాటిసాయంకాలపు కార్యక్రమం. గ్రామంలోని ఆబాలగోపాలం సభకు వచ్చారు. మంత్రిగారి ఉపన్యాసం శ్రద్ధగా విన్నారు. "గ్రామీయుల పురోవృద్ధికీ, విజ్ఞానానికీ బాగా తోడ్పాటు కాగలదని మెచ్చి ప్రభుత్వం వారు పట్టణాల్లోనే కాకుండా ముఖ్యమైన గ్రామాలోకూడా ఈ 'రేడియో' లేక 'ఆకాశవాణి'ని అమర్చినారు. దీనిద్వారా కాలనియమానుసారంగా మీకు, భారతమాత ముద్దుబిడ్డలైన మీకు, ప్రపంచమంతటికీ ఆహారం పెడుతూన్న మీకు, ఉపక

రించేటందుకున్నూ, విజ్ఞానం విస్తరించేటందుకున్నూ, కొన్ని ఉపన్యాసాలు, కొన్ని ఇతరవ్యాసంగాలు, పండితులచేతనైతేనేమి, పామరులచేత నైతేనేమి ఈ 'ఆకాశవాణి' ద్వారా వినిపిస్తుంటవి. చెన్నపట్నంలో చెప్పిన ఉపన్యాసం వెంటనే మీ గ్రామానికి వచ్చి ఎలాగు వినబడుతుందన్న సందేహం మీ కెంతమాత్రం అక్కరలేదు. విజ్ఞానశాస్త్రవేత్తలు, కనిపెట్టిన మహాయంత్ర మిది. ఆకాశంమీదనుంచి ప్రపంచం అంతటా ప్రసరించే శబ్దము కర్ణగోచరం అయేటట్టుచేసే ఈ 'రేడియోను' మీరు సద్వినియోగంచేసికొంటూ మీ మీ జ్ఞాన ప్రతిభను ఎక్కువచేసికొని, నలుదిక్కులా వ్యాపింపజేస్తారని నమ్ముతున్నాను..." అని మంత్రిగారు చెబుతూంటే గ్రామస్థులంతా కాపుజనం యావన్మందీ చకితులై విన్నారు. ఉపన్యాసానంతరం మంత్రిగారు ఒక చిన్నమీట నొక్కారు. వెంటనే గాలివీచినట్లు 'బస్'మని ఒక రొద,—పిమ్మట ఆకాశంనుంచి పెద్ద గొంతుకతో ఒక ఉపన్యాసం వినిపించింది. అది డాక్టరు పిచ్చయ్యగారి 'కలరా' ఉపన్యాసం : "కలరా భయంకరమైన జాడ్యం. గ్రామాల్లో ఈ జాడ్యానికే 'గొట్టాలమ్మ' అనికూడా పేరున్నది. ......" అంటూ డాక్టరు పిచ్చయ్యగారు రేడియోలో చెప్పిన ఉపన్యాసంవినిన కాపుజనంయొక్క ఆశ్చర్యానికి అంతులేదు. మీదనుంచి శబ్దం వినిపిస్తూందికదా, ఆకాశమార్గాన్ని ఎవ్వరైనా ఉన్నారేమోనన్న భ్రమచేత నింగికి నాలుగువైపులా దృష్టినిగిడ్చి చూచాడు, ముసలి దానయ్య, తొలకరి మేఘానికి ఆతృతగా దృష్టిసారించే రైతుబిడ్డవలె.

దానయ్య:—(కుమారుడు అసిరయ్యతో) "మీద మనుసులు నేరుగందా, ఈశబ్దం ఏటంటా? పెద్దోడా, ఇది 'ఆకాశోణి' అయితే, మీద మనుసులైనా వుండాల' నేకపోతే తీగెటపానాగు, తివ్వలైనా వుండాలగదంటా!"

అసిరయ్య:—"తీగలేదు, ఏటీలేదు,—గొట్టం భూమిలోంచి లెగిసిందిగనక, దీనికి 'భూవాణి' అన్నపేరు బాగుంటాదేమో, 'ఆకాశవాణి'కంటె."

మరొకముసలిరైతు:—(దానయ్యతో) "సూసినావా, నేస్తం! బూవిలోంచిగొట్టం, దానిమీద నాలుగుదిక్కులా కొమ్ముగొట్టాలు నాలుగు—అంతా గొట్టాలమయం! అందుసేత, నా నేటంతానంటే, ఇదీ 'ఆకాశోణి' కాదు, 'భూవోణి' కాదు, ఇది నిక్కచ్చిగా 'గొట్టాలమ్మవాణి' అందుసేతనే తొలుతనే గొట్టాలమ్మ గొడవతో ఆరంబం సేసింది."

దానయ్య:—"మరైతే, మంత్రి ఇది జంతరమంటాడే!"

* * *

ఇంతలో 'రేడియో' కలరా ఉపన్యాసం కట్టిబెట్టి చల్లనిగీతం పాడడం ఆరంభించింది. అది సుబ్బారావుగారి 'ఎంకిపాటల'లోనిది ఒకటి. శ్రావ్యంగా, చల్లగా, కాపుజనం హృదయాల్ని కలవరపెట్టిందాగీతం. యువకులంతా శ్రద్ధగా విన్నారు. విని ఆనందించారు. బాలికలు పక్కన నవ్వారు. నవోఢలు ముసిముసినవ్వులు నవ్వుతూ ఇంటికి దారి తీశారు. నడివయసు స్త్రీలు ముక్కుమీద వేలేసుకుని ముఖముఖాలు చూసుకున్నారు. ముసలి అత్తగార్లు, "బే గింటి కెళ్ళి గెంజ

కాసండే" అని వాళ్ళని మందలించారు. గీతం ముగిసినపిమ్మట 'రామాయణకాలక్షేపం' వినిపించింది 'రేడియో.' కాపుజన మంతా భక్తిపరవశులైనారు. ఈవిధంగా 'రేడియో' శ్రవణం లోను, ఉత్సవంలోను, నాయకుల ఊరేగింపుతోను, మంత్రి గారి మంతనాలతోను సాయంకాలం గడిచిపోయింది. కాని, 'రేడియో' 'గొట్టాలమ్మవాణి' అన్నమాట ఊరంతా అల్లు కున్నది. పెద్దకాపుల గుసగుస లూరకేపోతాయా, మరి? బాలురు భయంతోనే నిద్రపోయారు. వృద్ధులు గొట్టాలమ్మకి తృప్తి అయ్యేటట్టుగా గ్రామంలో భజనలు చెయ్యమన్నారు. ముసలి ముత్తైదువలు, అర్ధరాత్రివేళ పానకం, పచ్చనిఅన్నం తీసుకెళ్ళి రేడియో లౌడ్‌స్పీకరు మొదలున దిగదుడిచి పారే శారు. పోతరాజుమాత్రం గ్రామస్థుల మూర్ఖత్వానికి నవ్వు కున్నాడు. 'రేడియో' ప్రమాదకరమైన దేవతా, దెయ్యం కాదని వాళ్ళకి నచ్చజెప్పడానికి అతనికి దండగడియం పట్టింది: నాటి 'ఆంధ్రపత్రిక' తీసి చూచి, సాయంకాలం ఇన్నిగంటలకు ఈ రేడియో కార్యక్రమం ఈవిధంగా వుంటుందనీ, అంతా హాయిగా వినవచ్చుననీ చెప్పి తిరిగీ సాయంకాలం అందరినీ రేడియోవద్ద చేర్చి వారికి భయం తొలగించాడు.

## 3

గ్రామంలో కాలం చక్కగాసాగిపోతూంది. అందరూ నిశ్చింతగా వారివారి పనులలో మగ్నులై, సాయంకాలం, మునిమాపుపొద్దులో 'రేడియో' నిమగ్నులై హాయిగా వుంటూన్నారు—ఒక్కరు—గ్రామ పురోహితుడు విశ్వేశ్వర సోమయాజితప్ప!—అసలు అతడు ఏయజ్ఞం చెయ్యకుండానే

సోమయాజి అయినాడు తాతగారి పేరుపెట్టుకొని. గొప్ప స్వాభిమాని. దురహంకారం. సనాతనధర్మం భావకుండా తానే నిలబెట్టినట్లూహించే గర్వి. నూతనశక్తి లేం అతగానికి నచ్చవు. నచ్చజెప్పినా వినడు! ఒక్కనాడు రేడియో విన డానికి రాలేదు. దానికి మరో కారణంకూడా వుంది. ఈ 'రేడియో' వచ్చినప్పట్నుంచీ, అతగాడి పురాణకాలక్షేపం వినడానికిగాని, ఇతర వెర్రిమొర్రి వేదాంతపుకబుర్లు వినడానికి గాని గ్రామంలోని పిల్లలు, పెద్దలు బొత్తుగా రావడం మానే శారు. ఇక నేముందీ, సోమయాజిగారిని అసూయాదేవత, లోభదేవతా, రెండూ ఒక్కసారి ఆవేశించినాయి. తన పురా ణం పుక్కిటిపురాణమై మూల పడడంచేత తనకు చిక్కవలసిన నాలుగుడబ్బులు చిక్కవాయె,—పాపం, అసలుకే వచ్చింది ప్రమాదం. అతడు రోషపూరితుడైనాడు. సహజమైన ఆత్మ స్తుతి, పరదూషణ ప్రారంభించాడు. "బ్రాహ్మణద్వేషం ప్రబలమైపోయింది. భక్తీ, శ్రద్ధా, బుద్దీ, బొత్తుగా అంత రించిపోయాయి. భారత భాగవత రామాయణాది మహా పురాణములు సాంగోపాంగముగా చదివి, జీర్ణించుకున్న ముండాకొడుకుని నన్నే ధిక్కరించేస్తూంటే, పిల్లకి తక్కిన వాళ్లు లెక్కేమిటి? అయినా ఈ 'రేడియో' ఏం వచ్చిందో కాని గ్రామం పూర్తిగా పాడైపోయింది. వర్ణసంకర ప్రభు త్వం ఎలాగుందో ఈయంత్రాలూ, ఈతంత్రాలూ, తందాన పదాలూ అలాగే వున్నాయి. అన్నింటికీ 'రేడియో' వేనట! ప్రపంచ పరిస్థితులేలాగుంటాయో తెలుసుకొనేటందుకూ, పంచాంగం అక్కర్లేదట! అవి ఏరోజు కారోజు రేడియోలో వస్తాయట! ఇక శాస్త్రం నన్నెవ్వరూ అడగరట! అదీ

ఆ రేడియోవే చెబుతుందిట, వీళ్ళ రేడియో మండా! హరి కథలు చెబుతుందిట, పురాణం చెబుతుందిట, వాళ్ళపింఛం చెబుతుందిట,—రేపు వాళ్ళ యిళ్ళల్లో శ్రాద్ధాలకి మంత్రం కూడా చెబుతుంది కాబోలు!" అని తలపోసుకొని, రేడియో ప్రతిష్ఠ అయిన మరుచటివారంనుంచీ 'రేడియో'కి వ్యతిరేకంగా ధ్వజం ఎత్తాడు. నలుగురు ముసలాళ్ళ సిబ్బందిని తయారు చేశాడు. వాళ్లని కూర్చోబెట్టుకొని, రేడియో ఒక గొప్ప ప్రమాదకరమైన వస్తువనీ, నాడు కంసుని బొందెలోని ప్రాణాలు తియ్యడాని కిదే మూలకారణమనీ, ఈయంత్రాలన్నీ మన పూర్వులకు తెలియనివి కావనీ, పూర్వులు నేటి కుర్రకుంకాయలకంటె మేధాసంపన్నులనీ, వారికి అన్ని యంత్రాలు తెలిసినప్పటికీ, వానివల్లనుండే ప్రమాదం గుర్తెరిగి వాటిని ఆచరణలోకి తేలేదనీ, భరతఖండం సాత్వికసాంప్రదాయమైనదనీ, ఈదేశానికి రజోగుణప్రాధాన్యములైన ఈ యంత్రాలన్నీ అరిష్టకారణాలనీ,—అర్థంలేనివి కొన్నీ అర్థం ఉన్నవి కొన్నీ ముక్కలు సుబ్బిశెట్టి, రామిరెడ్డి మొదలైన తన అనుచరులకు గట్టిగా దమాయించి చెప్పడంఆరంభించాడు. సోమయాజి రేడియోమీదనే కాక అందరిమీదా ధ్వజమెత్తి తిడుతూన్నవార్త, గాలివార్తగా నున్న పోతరాజుచెవికిసోకింది. ఇక నేముంది?—వచ్చింది సంఘర్షణ—పూర్వాచారాలకీ, ఆధునిక విజ్ఞానానికీ; పురాతన శక్తికీ, నూతన శక్తికీ; వృద్ధాప్యానికీ, యౌవనానికీ; జడత్వానికీ, ఉద్రేకపూరితమైన సంచలనానికీ; పాతకీ, క్రొత్తకీ;—ఆగ్రామంలో రాపిడిసంభవించింది.

అగ్నిపడింది, జ్వాలగాపరిణమించి వ్యాపించింది. బ్రాహ్మణ అసూయ బట్టబయలయ్యేటట్లు పోతరాజు "గ్రామంలో ఉప

న్యాసంచెప్పాడు. ఈసంగతి సోమయాజులు యింట్లో వుండే, విని హుంకరించి వూరుకున్నాడు, తాత్కాలితంగా. కాని తగిన సమయంకోసంమాత్రం నిరీక్షిస్తూనే వున్నాడు.

౬

ఈ సందర్భాల్లో పోతరాజుపలుకుబడి గ్రామంలో మరీ యెక్కువై పోయింది. సబబుగానూ సహేతుకంగానూ మాట్లాడితే ఎవ్వరికి నచ్చదుగనుక ? బాలురు, యువకులు, వృద్ధులుకూడా పోతరాజు పక్షాన్నే వున్నారు.

సంక్రాంతిపండుగ నాలుగురోజులుంది. సంక్రాంతి, తక్కినవాళ్ల కేమోగాని, సోమయాజికిమాత్రం నిజంగా పండుగే. అతడికి నాలుగు వరహాలు దొరికేసమయమది. అంతవరకూ వీధిచావడి ఎక్కని సోమయాజి ఆనాడు వీధి అరుగుమీదే కూర్చున్నాడు సగర్వంగా. ఎదురింట సుబ్బిశెట్టి గారి సావడిలో శెట్టికొడుకు లెక్కలు రాసుకుంటున్నాడు. సోమయాజి పొడుం పీల్చి, "సంక్రాంతి వస్తుందికదా - ఈ శుంఠలంతా పెద్దలకి పెట్టడంఅదీ వుందికదా - నాడు సంకల్పానికి నన్ను పిలవకాపోరు, అప్పుడు వీళ్ళపెద్దలకి వినికిరైనట్టు వీళ్ళతాడు పుటుక్కున తెంచకాపోను" అని గట్టిగా గద్దించాడు, సెట్టికొడుకువైపు చూచి. సెట్టికొడుకు అప్పటికి ఊరుకున్నా, మధ్యాహ్నంలోపున ఆకబుర్లన్నీ పోతరాజుకి టపాకట్టాడు.

శెట్టికొడుకు:—సంక్రాంతినాడు మన అందరి పీకలూ నొక్కుతానని తాటిస్తున్నాడు పురోహితుడు.

పోతరాజు:—మన యిళ్ళకి రానంటాడా యేమిటి, మన పెద్దల్ని తరింపజేయడానికి?

శే. కో:—మరే మనకందరికీ బుద్ధి వచ్చేపాఠం చెప్పే సమయం వచ్చిందని మురిసి పోతున్నాడు, బ్రాహ్మడు.

పో:—కానీ, అదేదో మనమూ చూద్దాం. రాకపోతే చెడిపోయిం దేమీలేదు. బ్రాహ్మడు మనయిళ్ళకి రాకపోయి నంతమాత్రాన్ని మనపెద్దల ఉత్తరగతులు అరికట్టబడతాయని నాకెంతమాత్రం నమ్మకం లేదు. మన పెద్దలపూజ సంక్రాంతి నాడు మనసారా మనమే చేదాం. నిర్మలమైన హృదయా లతో వారిని మనమే కొలిచి ఆరాధించుదాము. బ్రాహ్మ డికి చెల్లించవలసిన సుంకమే మనకి మిగిలిపోతుంది. ఈ విషయం నేటి సాయంకాలమే ఒక బహిరంగ సభచేసి అందరికీ తెలియపరుద్దాం. మీనాయన నేమీ భయపడవద్దని చెప్పి బందోబస్తుచెయ్యి, పైచర్య నేను జరిపిస్తాను.

నాటి సాయంకాలం పెద్దసభ జరిగింది. బ్రాహ్మడు మామూలుగా సంక్రాంతినాడుదయం యిళ్ళకి వస్తేసరి, లేక పోతే ఎప్పటికీ పిలవకూడదని తీర్మానించారు. అంతేకాక, సంక్రాంతినాటి ఉదయం సరిగా ఎనిమిదిగంటలకు, గ్రామం లోని జనంఅంతా 'రేడియో'మండపమువద్ద సమావేశమై, పోతరాజు, తదితర ముఖ్యుల ఉపన్యాసాలు విని, వారిపూర్వ పురుషుల పూజ - అర్థంతెలియని మాటలలో కాకుండా, అర్థం విశదంగా తెలిసే ముక్కలతో - కలిసి చెయ్యడానికి నిశ్చయించారు. ఈవార్త కర్ణాకర్ణిగా సోమయాజులుగారికి కూడా తెలిసింది. తెలిసి అతడు మరింత బిర్రబిగిసి పెట్టుసరి చేశాడు.

అహంకార ప్రవాహంలో కొట్టుకు పోతూన్న బ్రాహ్మ డికి యుక్తాయుక్తవిచక్షణత లేకపోయింది. దెబ్బతిన్న త్రాచు వలె బుసకొట్టడం ఆరంభించాడు. తనకాళ్ళు పట్టుకుంటేనే కాని బ్రతికివున్నవారికీ, లోకాంతరగతులైనవారి ఆత్మలకీ కూడా గతిలేదన్న గాఢమైన దుర్భ్రమలో పడిపోయాడు. వారిఆత్మలకు స్వర్గద్వారప్రవేశము చేయించే తాళంచెవి తానే ననుకున్నాడు. పెద్దలను పాపపంకిలంనుంచి లేవనెత్తే చేయూత, పట్టుగొమ్మ, తానుతప్ప మరెవ్వరూ లేరనుకు న్నాడు. ఎంతటిమూఢత! ఎంతటి తెలివిహీనత!

తెల్లవారింది, నాడే సంక్రాంతి, మహాపవిత్రమైన దివ సము. గ్రామస్థులంతా ఒక్కసారి తనకు పాదాక్రాంతులై, గడ్డికరిస్తేనేగాని, వీధిగుమ్మంలో అడుగుపెట్టనని భీష్మించుకు కూర్చున్నాడు, యింటి చావడిలో, వీధి తలుపు తెరచుకొని సోమయాజి, సుమారు ఎనిమిది గంటలవేళ. గ్రామస్థులు, సాయంత్రం చేసుకున్న తీర్మానంప్రకారం 'రేడియో' మాట పానికి పయనమైనారు. సోమయాజులుగారి గుమ్మంలోనుంచే వారిదారి. తన్ను బ్రతిమాలుటకే వారు వస్తున్నారని భ్రమిం చాడు బ్రాహ్మణుడు. కాని, జనం తన యిల్లు దాటి సాగి పోగానే, హతాశుడైనాడు.

సరిగా ఎనిమిదిగంటలవేళ, — కాకతాళీయంగా 'రేడియో'లో ఆవేళ 'సంక్రాంతి'మీదనే ఉపన్యాసం. తద నంతరం 'స్పెషల్ ప్రోగ్రామ్'. ప్రసిద్ధ ఆంధ్రపండితులు, నారాయణశాస్త్రిగారి సంకల్పం - ఆపైని వేదాంతగోష్ఠి - గ్రామస్థుల సంతోషానికి మేరలేదు. ఉత్సాహంతో ఉప్పొంగి

పోయారు. వారు ఇట్టి సుముహూర్తంలో తమ పెద్దల్ని తలుచుకొని, నీళ్ళుచుక్కలు వదిలిపెట్టడమే గొప్ప సంగతను కున్నారు. గ్రామపురోహితుడి తలంపే వాళ్లకి లేకపోయింది. "మహానుభావుడు, సంకల్పం చెప్పాడు రేడియో గో, మనం ఆచరించాము భక్తిపూర్వకంగా; నేడు సునినం. 'రేడియో' ప్రభావం వల్ల నేటి సంక్రాంతి, ఎల్లరకూ సంతృప్తిగా జరిగి పోయినందుకు ఈశ్వరునికి ధన్యవాదాలు" అని పోతరాజు నాటి ఉదయం కార్యక్రమం ముగించినాడు. జనం అంతా ఆనందంతో ఎవరిగృహాలకి వాళ్ళు చెదిరిపోయారు.

సోమయాజులుగారి భార్య గుమ్మంలోనే నిలబడి జనాన్ని చూచి, లోపలికెళ్ళి భర్తతో "ఆఖరికి మీ అహంకారమే మీకు మిగిలిందికాని, కాసంతలాభం లేకపోయింది. మీ అహంకారమూ, మీమొండ్తనం - ఎప్పుడూ ఇంతే! గ్రామస్తుల మీదను అలిగి జర్రుకున్న దేముంది! ఏదో విధంగా జనంతో రాజీ చేసుకోండి; లేకపోతే ఇక్కణ్ణించి మకాం ఎత్తేయవలసి వస్తుంది" అన్నది. "నాయేడుపేదో నేనేడుస్తాను, నువ్వు లోపలికెళ్ళు" అన్నాడాయన. ముఖం చిట్లించుకొని, బ్రాహ్మడు జరిగిన పరాభవం హృదయంలో నాటించుకు న్నాడు. పశ్చాత్తాపం పొందినాడు.

మరునాటి నుంచీ, అందరితోపాటు 'రేడియో' మంట పానికి తానూ ప్రయనమయేవాడు ఆయన.—

రెండునెలలు గిర్రున తిరిగేసరికి మళ్ళీ బ్రహ్మశ్రీ విశ్వేశ్వర సోమయాజులుగారికీ, గ్రామస్తులకీ పూర్తిగా రాజీ కుదిరిపోయిందని వింటున్నాం.

---



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TDLA1047B157 |
| పుస్తకం పేరు | గొంథసోసం |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 91 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | LAKSHMI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |